శ్రీ రస్తు.

1622

# మంగళగిరి మాహాత్మ్యము

(స్థలపురాణము)







కవిసార్వభౌమ

·

(స్థలపురాణము)

---

గ్రంథకర్త.

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ,
ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ, వేద విద్యావిశారద,

## శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

---

ప్రకాశకులు.

**వెంకటరామ & కో., బెజవాడ**

500 ప్రతులు

బెజవాడ

కవితిలక ముద్రాక్షరశాల.

**1947**

 వెల 1—8—0

# పీఠిక

1946 సంవత్సరమున నాకు గుంటూరు పుర వాస్తవ్యులు గొప్ప సన్మానము గావించియున్నారు. ఆసందర్భమున నేను తత్పురంబునఁ బ్రసిద్ధివహించిన రావుసాహెబు శ్రీ వినపాముల సీతారామయ్యగారి యింట నివసించి భోజన భాజనాదులఁ బ్రితృప్తి వహించితిని. అప్పుడొక సందర్భమున నేను సీతారామయ్యగారితో నావలన మీ రొక గ్రంథముం గృతిపుచ్చుకొనుఁడని కోరితిని. వారు మీరు రచింప నెంచుకృతిని మాతండ్రిగారు లక్ష్మీనరసింహముగారి కొసంగుఁడని నన్ను వారియొద్దకుంగొని పోయి తద్వృత్తాంతమంతయు విన్నవించిరి. వారును నన్నతి గౌరవంబునం గాంచి మంగళగిరి లక్ష్మీనరసింహస్వామి మాకిలువేలుపై యున్నవాఁడాతని చరితమంతయును సంగ్రహించి యొక్కచక్కనిగ్రంథము రచించి నన్నును మా కులంబు నాశీర్వదింపుఁడనిచెప్పిరి. అప్పుడు సీతారామయ్యగారు నన్ను మంగళగిరికిం దోడుకొని పోయి స్వామిచరిత్రము పర్వతవిశేషము సర్వము నచటి పెద్దలచేఁ దెలియఁ జెప్పించుట కాక యట సంస్కృతమున ముద్రింపఁబడియున్న యొకగ్రంథమును గూడ సంపాదించి నా కిచ్చిరి.

నే నావిషయమంతయు గరతలామలకముగ గ్రహించి తద్గ్రంథముం జూచి యిట్లీగ్రంథము రచించితిని.

ఈగ్రంథమందు మఱికొన్ని కొన్ని క్రొత్తవిషయములు గలవు. ఇంతకంటె విశేషగ్రంథము సంప్రాప్తమైనచో ద్వితీయముద్రణమునఁ జేర్పఁగల నని విన్నవించుచున్నాను.

శ్రీ॥ కృ॥ శా స్త్రి.

# మంగళగిరి మహాత్మ్యము

## విషయసూచిక

### ఉపోద్ఘాతము

### ప్రథమాశ్వాసము



### ద్వితీయాశ్వాసము



### తృతీయాశ్వాసము



### చతుర్థాశ్వాసము



### పంచమాశ్వాసము

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 16 | మహాత్వ | మహాత్త్వ |
| 7 | 22 | చేర్మికా | చేర్మికా |
| 8 | 17 | నవరసుఁడు | నారసుఁడు |
| 10 | 16 | రెండవ | రెండవు |
| 13 | 9 | నీవెఱుంగని | లీవెఱుంగని |
| 15 | 18 | నిచ్చి | విచ్చి |
| 17 | 28 | కుఞ్ లీలఞ్ విరాజిల్లుచుఁ | లీలవిరాజిలు చుండుచోటికిఞ్ |
| 18 | 1 | నొవఁగ | గొనఁగ |
| ,, | 4 | పానముల్ | పానకముల్ |
| ,, | 12 | జిరుగు | జిగురు. |
| 22 | 25 | గూర్చి | గూల్చి |
| 30 | 21 | బహ్మ | బ్రహ్మ |
| 34 | 17 | విద్యల నేర్చి | విద్యల న్నేర్చి |
| 36 | 5 | యీందాద్రిద్రి | యిందాద్రిది |
| 39 | 22 | ఖహు | బాహు |
| 40 | 20 | వొన్నంచి | నొన్నంచి |
| 42 | 27 | నాలు | వాలు |
| 47 | 16 | బ్రీతినిల్వ | బ్రీతిన్నిల్వ |
| 61 | 23 | మెత్రి | మైత్రి |
| 62 | 27 | రుదుతో | రుద్ధుతో |
| 74 | 20 | తీర్థనాం | తీర్థంబునా |
| 75 | 2 | చుఁద్వ | చుండఁద్వ |
| 78 | 3 | పరవు | పరశువు |
| 79 | 3 | విరభ్రరాట్సుతను | విదర్భరాట్సుతః |
| ,, | 18 | మహిసురుండు | మహిసురుండు |
| 80 | 1 | వత్సుల | పత్సుల |
| ,, | 2 | మానొంద | జానొంద |
| 81 | 6 | సంథ్య | సంధ్య |
| 84 | 9 | కుబ్రాణు | కుబ్రాహ్మణుని |
| ,, | 16 | వేము | లేము |
| 85 | 6 | గురెట్టి | గుర్వెట్టి |
| 86 | 6 | నాజడీఘుండు | నాడీజంఘుండు |
| 101 | 17 | నజ్జనాధు | నగ్గనాథు |



శ్రీ వినపాముల లక్ష్మీనరసింహ దంపతులు.

శ్రీరస్తు

# మంగళగిరిమాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

## ఇష్టదేవతాప్రార్థనాదికము



కళ్యాణగుణాస్పదుండు త్రిజగత్సేవ్యుండు భవ్యుండు ది
వ్యాకారుం డమరేశ్వరాంచితుఁడు ప్రహ్లాదప్రియుం డబ్జజా
ప్తైకేడ్యుం డగుమంగళాద్రినరసింహస్వామి సాక్షా చ్ఛుభ
శ్రీకున్ శ్రీవినపాములాన్వయుని లక్ష్మీనారసింహాఖ్యునిన్.

శా. శ్రీతోఁ బుట్టువు శీర్షమందుఁ గొని గౌరిన్ వామపార్శ్వంబునన్
జేతోమోదముగాఁగ నిల్పుకొని వాసిన్ సర్వలోకేశ్వరుం
డైతల్లోకత్రైకదేవదేవుఁడు దయాస్వాంతంబునం బ్రోచుతన్
సీతారామయఁ గన్నతండ్రి యగులక్ష్మీనారసింహార్యునిన్. 2

క. ప్రఖ్యాతంబుగ జగము ల
భిఖ్యాగతి సృష్టిసేయ వెలసినసురరా
ణ్ముఖ్యుఁడు లక్ష్మీనరసిం
హాఖ్యునకు నొసంగు నాయురారోగ్యములన్. 3

చ. కలువలఱేనితోడు గిరికన్యకజోడు రతీశునమ్మ త
మ్ముల నివసించుకొమ్మ కనుముద్దులు గుల్కఁగఁ బాలవెల్లిలో
వెలసినముద్దరాలు కఱివేలుపునాలిల నేలుమేటి య
క్కలుములబోటి పేర్మిఁ గనుఁగావుత మావినపాములాన్వయున్. 4

సీ. చిన్నారిముంగురుల్ చిందులు ద్రొక్కంగ
నుదుట జాబిలిరేకఁ గదియఁ జేసి
మధుమదవివశయై మంజులవాగ్విలా
సము విస్తరిల్లఁగ సలుపుకొనుచు
నసుఁ గొంచు తమ్మిపై నిడి రత్నపీఠము
నందు సుఖాసీన యగుచు నుండి
వీణ వాయించుచు గాణయై మెడ నెడఁ
జిలుకలపలుకులు చెవుల నిడుచుఁ
తే. గలువవేరు ధరించి కోమలమయి హరి
నీలమాణిక్యకాంతులు నెఱి నెసంగు
మెయి నరుణవస్త్రమెంతయు మిసిమి మెఱయ
జగము నేలుశ్యామల కృతీశ్వరునిఁ బ్రోచు. 5

శా. మూఁడై రెండై తగఁ బొల్చుపీఠములలో ముఖ్యత్వముం గాంచి బె
జ్వాడం బైడిపదంబు ముక్తి గలుగం జెల్వం బొల్చి భక్తాళికిం
దోడై యుండెడిదుర్గ ప్రోచుత దయన్ దోషంబులం బాపి నా
నాఁ డెచ్చున్ విభవోన్నతుల్ బుధవరున్ లక్ష్మీనృసింహార్యునిన్. 6

తే. గణపతిని గొల్చి శారదఁ బ్రణుతిఁ జేసి
త్రిపురసుందరి స్మరియించి శ్రీ భజించి
కులగురుని గౌశికుఁ దలంచి లలితకవుల
వ్యాసవాల్మీకిముఖ్యుల నభినుతింతు. 7

వ. అని పూజ్యపూజాతత్పరుండనై నే నొక్క కాలంబున నాంధ్రమండ
లంబునందలి గుంటూరు పురంబునకుం బోయి యున్నయప్పు
డప్పురంబున. 8

సీ. మహితవిద్యారాజమాన్యమహా భూసుర
వంశాబ్ధి నైనజైవాతృకుండు

రాజాధిరాజగౌరవపాత్ర మగుమేటి
　　　యుద్యోగమునఁ బొలుపొందుమేటి
వేదశాస్త్రప్రియుం డై దానధర్మముల్
　　　సేయుచుండునదాన్యశేఖరుండు
భూతదయాళుత్వమునఁ జేసి యెల్లర
　　　సమబుద్ధిమైఁ జూచుసదయహృదయుఁ
తే. డతండు దేవభూదేవభక్త్యంచితుండు
సంతతాశ్రితరక్షణైకాంతరంగుఁ
డమలచరితుండు వినపాములాన్వయమణి
పొదలుచుండు సీతారామభూసురుండు. 9

వ. అతండు నన్నెంతయు నాదరించి. 10

మ. అలగుంటూరను దేశిరాజకులుఁడౌ హన్మంతరావున్ దెలా
కులజాలయ్యయు లోనిముఖ్యులను జైకొంచుం దగం గూర్చి పొ
మ్మలఘుప్రక్రియ రెండువేలయుదునూ ర్లర్పించి సమ్మానమున్
సలిపెన్ నా కతఁ డెంతయోనియును బ్రజ్ఞావైభవం బేర్పడన్. 11

వ. అట్టి యవసరంబున. 12

ఉ. ఆతనిఁ గాంచి యొక్కదినమం దిటు లంటి బుధేంద్రచంద్ర! నీ
నీతియు నీదుదాతృతయు నీదగుయోగ్యత నీవుపొందితి
రీతియు నీదుగౌరవగరిష్ఠత నీకవితాప్రియత్వమున్
జేతము పల్లవించునటు చేసె నటంచు నిజంబు చెప్పుదున్. 13

ఉ. ఉత్తమనాయకుండ వని యుల్లము పల్లవితంబు గావునన్
మెత్తనిపాకమును గలుగ మేలుకృతిన్ రచియించి మీకు నేఁ
జిత్తము చేసితిన్ గొనుము శ్రీయును సంపదయున్ యశంబు నిన్
హత్తగ వచ్చు నందున ననంతములై ద్విజరాజశేఖరా. 14

క. అనినం గా దన కాతఁడు
ననుఁ గని యిట్లనియె వినయనయవాక్యచయం
బనువొంద నాదువంశము
తనరెడునది యద్యో నేను ధన్యుఁడ నైతిన్. 15

క. కానీ యొక్కటఁ జెప్పెద
నానతికిం బాత్రమగుచు నాతండిక్కే కనున్
జ్ఞాని యగు నమ్మహాత్ముని
మానసమును బట్టి వెలుఁగ మన మగు నాకున్. 16

క. కృతి వారిపేర నొసఁగుట
యతికుతుకము నాకు వారియాత్మయె నేనై
క్షితి నగుటఁ దత్ఫలం బది
యతుకం జనుఁడంచు నన్ను నది యట్లనఁగన్. 17

ఉ. వారికి నేతదర్థమును వాకొని వారు వచించినట్లుగాఁ
గోరుదు నంచు వారికడకున్ ననుఁ గొంచుగమించిచెప్పుడున్
వారు నదంతయున్ వినుచు నాదెసమోము నిగిడ్చి సత్కవుల్
మీరు మహానుభావులరు మీసుకవిత్వమహత్వ మెన్నదున్. 18

క. నాపైఁ గూరిమి మీ రీ
నాపుత్రునితోడఁ గృతిఁ గొనం జెప్పుటచే
మాపితలు మేము ధన్యుల
మై పొలిచితి మనుచు మఱియు ననురాగమునన్. 19

తే. మంగళాద్రినృసింహుఁడు మాకుఁ దోఁచు
నీడ వానిచరిత్రము నేర్పు మీఱఁ
జక్కనిప్రబంధ మొనరింప సంతసింతు
ననుచుఁ దనమనోరథ మెల్ల నానతిచ్చె. 20

వ. అని సబహుమానంబుగం బలికిన నది యంతయు నెఱింగి నేను వారి కాశీర్వచనపూర్వకంబుగా మంగళగిరిమాహాత్మ్యం బను మహాపురాణంబు రచింపం దలంచి ముందు మంగళాచరణంబుగా నమ్మహీదేవకులావతంసంబు వంశావతారం బభివర్ణించెద. 21

—♦ కృతిపతి వంశావతారము ♦—

సీ. శ్రీరమణీమణీజీవితేశ్వరునాభి
సరసిజ మేస్వామిజన్మభూమి
తలవాకిళుల నెల్లఁ గలిగి లోకము లేలు
తరళాక్షి యేవేల్పుధర్మపత్ని
క్షీరనీర విభాగ మారసి చేసెడు
పక్కి యేదేవర యెక్కిరింత
దేవమునీంద్రులు దీపించునిక్కపు
జగ మేమహాత్మునిఁ దగినటెంకి

తే. అతఁడు నలువొందు శ్రీకాయజాగ్రజుండు
బ్రదుకుఁబ్రొద్దుల నొసఁగుల వ్రాయువేల్పు
వేల్పులకుఁ బెద్ద వెలిదమ్మి వెలుఁగుమేటి
జగములం జేయుదిట్ట మేల్ జన్నిగట్టు. 22

క. ఆతనివంశమునందుఁ
ఖ్యాతిఁ శ్యాలాయనుం డను నొకఋషి యా
భూతలమునఁ దద్గోత్రో
ద్భూతులు పెక్కండ్రు ద్విజులు పొలిచిరి ఘనులై. 23

తే. అందుఁ గొందఱు నైజామునం దభిఖ్య
నందువినపాము లనుగ్రామమునందు ముందు
వఱలుటను వినపాములవారు నాఁగ
నింటిపేరు గలారై యొప్పుచుండ్రు, 24

క. ఎన్నంగ మఱియు వారల్
విన్నపముల నొందుచుండు విబుధులు గానన్
విన్నపములవా రయ్యును
గ్రన్నన్ వినపాములనఁగ రాజిలి రవనిన్. 25

క. ఆవినపాములవా రనఁ
గా వెలసినవారిలోన ఘనుఁడై పృథ్వీ
దేవకులాభరణం బై
చేవన్ లక్ష్మణమనీషి చెప్పఁగ నొప్పున్. 26

తే. అతఁడు శాస్త్రప్రవీణుఁడై యవని నతిశ
యిల్లి శంకరశాస్త్రి సర్వేశశాస్త్రి
యనెడుపుత్త్రద్వయంబును గనియె శివుఁడు
గణపతిని గార్తికేయుని గనినయట్లు. 27

వ. అందు శంకరశాస్త్రికి జోగిశాస్త్రి సుందరశాస్త్రి విశ్వనాథశాస్త్రి
గంగాధరావధాని యనునలువురుపుత్త్రు లందుఁ గడగొట్టువాఁ
డగు గంగాధరావధాని ఘనుండై. 28

క. రామావధాని నాఁబడు
శ్రీమహితుని సుతుని గాంచి చెన్నలరారెన్
రామావధానిపుత్త్రుఁడు
భూమిన్ నరసావధాని పొగడిత కెక్కెన్. 29

ఉ. సుబ్బయశాస్త్రిగా నతనిసూనుఁడు మైలవరంబునందుఁ బే
రబ్బఁగఁ బండితుం డగుచు నాఱగుశాస్త్రములందు నేరికే
నబ్బురపాటు దోఁపఁగ విహార మొనర్చుచు రాజచంద్రుపేర్
ప్రబ్బఁగఁ జేయుచుం బ్రబలె భారతవర్షము ప్రస్తుతింపఁగన్. 30

క. ఆసంస్థానమునందున్
భాసురుఁ డాతండు రాజపూజ్యుం డగుచున్
భాసిల్లుచు నాదెమ యను
భాసురమతి సుదతి సాధ్విఁ బరిణయ మయ్యెన్. 31

క. చల్లావారికులమునన్
జల్లదనం బెసక మెసఁగఁ జనియె నుసతియుం
దల్లన రామస్వామిన్
సల్లలితకుమారు నతఁడు జగతిం గనియెన్. 32

ఉ. తల్లియుఁ దండ్రియున్ గొనుకు తన్వియుఁ దన్ను గమించుచుండఁదా
నల్లన సంస్కృతిన్ నడపు నట్టిడయై సుజనైకవేద్యుఁడై
సల్లలితాత్ముఁడై నృపతిసత్కృతు లందుచు నైల్వారంబునం
దెల్లరు మెచ్చ నుండె ధర నిట్టిరు పుట్ట రటంచుఁ బల్కఁగన్. 33

వ. అట్లు ప్రఖ్యాతిం గాంచినసుబ్బయ్యశాస్త్రి. 34

చ. కొడుకున కైదువర్షములు కూడఁగ వచ్చినయప్పు డాతఁడా
కొడుకునుఁ దల్లిదండ్రులను గొమ్మను వీడి దివంబుఁ జేరఁ గా
నడచెను బుత్రశోకమున నర్సవధాని కరంబు కుందుచున్
విడిచి నృపాశ్రయంబు పురి వీడి కుటుంబము వెంటనంటఁగన్. 35

ఆ. మైలవరమునుండి మాన్యుఁ డానరసావ
ధాని శ్రీతెనాలిదాపున నగు
ఊవులూరుపురికిఁ దాఁ జనుదెంచి కా
పుర మొనర్చెఁ బ్రజలు ప్రోత్సహింప. 36

శా. ఆమాండ్కన్ నరసావధాని యట నున్నంతం గడుం బేర్మి క
ారామస్వామికిఁ బెండ్లి యయ్యె వనితారత్నంబు తత్పత్ని సా

ధీమాణిక్యము నర్సమాంబ యనుచుం బేరెక్కినై యొప్పునా
భూమిన్ దేవులపల్లివారిసుత యప్పూఁబోఁడి చర్చింపఁగన్. 37

శా. రామస్వామియు నర్సమాంబికయు నాగ్రామంబునం దుండి శ్రీ
రామస్వామియు సీతయుం బలెఁ గడున్ బ్రఖ్యాతినిం గాంచుచున్
భూమానందము నొందుచున్ దనయుల న్సుబ్రాయ లక్ష్మీనృసిం
హోమోదాహ్వయు వేంకటప్పయను నయ్యంబొప్పఁగాంచెన్ ధరన్ 38

వ. ఆరామస్వామిపుత్రిరత్నము లగునవ్వారిలో. 39

సీ. ఆద్యుఁడు సుబ్బరా వలరి వేంకటసుబ్బ
మాంబను రాజ్యలక్ష్మ్యంబ నుఱియు
రాజ్యలక్ష్మి యనంగ రమణుల మువ్వుర
నుద్వాహమై ప్రజ నొంద లేక
నారాయణాఖ్యుని గోరి దత్తునిఁ జేసి
కొనె నంత మూఁడవవనితయందుఁ
గనె లక్ష్మినారాయణుని దత్తుఁ డవల సుం
దరము యన్ గరితను బరిణయ మయ్యె

తే. కాపురంబుండెను దెనాలిగ్రామమందు
నవరసుఁడు తల్లితో నేగి యాంగ్లవిద్య
నభ్యసించెడు నిచ్చమై నల్లసేల
మున వసించెను విద్యార్థి యనఁగ నొప్పి. 40

క. అరయన్ రామస్వామికి
వరతనయుం డగుచు జగతి వఱలెడులక్ష్మీ
నరసింహానామధేయుఁడు
గరిమన్ వర్ణింప నగుచుఁ గరము దలిర్చెన్. 41

చ. అతఁడు బ్రిటిష్ప్రభుత్వమునయందుఁ బదస్థుఁడయై సమర్థతన్
నుతులకుఁ బాత్రమై తగి యనూనకళావిభవాభిరాముఁడై

స్థితిఁ గొని తద్విరామమును జేకొని పుష్పగిరిప్రసిద్ధికై
క్షితి నగుపీఠమందు యతిశేఖరునొద్ద నెసంగె మంత్రియై. 42

తే. అతఁడు నలువొందు వేదశాస్త్రాదివివిధ
విద్యలకుఁ దానకం బయి వెలయునన్వ
యమున మానికమై పుట్టినట్టిఘనుఁడు
శిష్టజనవర్తి లక్ష్మీనృసింహమూర్తి. 43

తే. ధర నరసరావుపేటయన్ పురమునందుఁ
బ్రబలు పులుపులవేంకటరామయార్యుఁ
డాది వేంకటసుబ్బాంబ యనెడుసాధ్వి
నవ్వలన్ విశాలాక్షిఁ బెండ్లాడె నందు. 44

క. అలవేంకటసుబ్బాంబకు
నలరెన్ లక్ష్మీనరసమ యనుకన్యక న
వ్వల నక్కన్నెవిశాలా
క్షి లలిం దాఁ బెంచెఁ గన్నచెలువము దోఁపన్. 45

క. అలవినపాములలక్ష్మీ
కలితనృసింహుండు లక్ష్మిగాఁ జెప్పఁగ నై
యలరెడులక్ష్మీనరసమ
సలలితమతి బెండ్లియాడె సజ్జను లెన్నన్. 46

సీ. లక్ష్మీనృసింహుఁడు లక్ష్మినా నొప్పల
క్ష్మీనరసమ్మయన్ చెల్వయందు
నాది సీతారామయాఖ్యుని సుతుఁ గని
వెనుక వేంకటసుబ్బమను మఱియును
రాజ్యలక్ష్మమను నరసమను సుతల మూఁ
గురఁ గాంచి ప్రథమను గొండవీట
నలరెడు బ్రహ్మజోస్యులవంశభవుఁడు సీ
తారామయకు సహధర్మిణిగను

తే. అవ్వల ద్వితీయసుతఁ బుల్సులాన్వవాయ
సత్యనారాయణుం డనుశ్యాలకునకు

తతముం గొని వాగర్థ
ప్రతిపత్తిని గలసికొనును వదలనిభక్తిన్. 55

శా. సీతం బోలినసాధ్వి యామె తనకుం జేదోడు వాదోడుగా
సీతారామయ తల్లిఁ దండ్రి నెపుడున్ సేవించుచున్ సంస్కృతిన్
బ్రీతిం జేయుచు రాజకీయగతులం బెంపొందుచున్ వర్తకం
బేతన్మాత్రముగాక సేయుచుఁ గడున్ హేమించు నిభ్యుండునై.

క. దొరలు పదస్థులు తన్నున్
గరిమం గనుచుండఁ బేరు గలఁడై గుంటూర్
పురి రావుసాహె బనియెడు
బిరుదంబును బొంది లోకవిఖ్యాతుఁ డగున్. 57

తే. అతఁడు వినపాములాన్వవాయప్రవరుఁడు
భూమిసురుఁడు సీతారామనామధేయుఁ
డాయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధిఁ
దనరుచుండుత మాచంద్రతారకముగ. 58

చ. గళమునఁ బానకంబు కనుఁగమ్మన నెమ్మెయిఁ గమ్మి యుండ భ
క్తుల కయిమోడ్పులం గొనుచుఁ గోరిక లీరిక లెత్త నేలుమం
గళగిరినారసింహుఁ డనుకంపమెయిం గనుఁగొంచు విన్నపం
బులకులవార్ధిచంద్రులను బ్రోచుచునుండెడుగాక నిచ్చలున్. 5

క. సీతారామయజనకుఁడు
పూతుఁడు లక్ష్మినృసింహబుధవర్యుఁడు వి
ఖ్యాతం బగునాకృతికిన్
నేత యటంచెంతయేని నే ముదితుఁడనై. 60

క. ఏతాదృగ్విధసుగుణ
ఖ్యాతునకున్ విప్రవంశకలశాంబుధిసం
జాతునకున్ వితరణసు
స్ఫీతయశునకున్ నృసింహసిద్ధాఖ్యునకున్. 61

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన మంగళగిరి
మాహాత్మ్యం బనుమహాపురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 62

— కథాప్రారంభము —

ఉ. నైమిశనామకాననమునన్ శుకశౌనకముఖ్యు లంచిత
స్తోమ మొనర్చుచున్నతఱి సూక్తిసమేతుఁడు సూతుఁ డేగుదే
నామునిచంద్రు లందఱు దయారసపూరితచిత్తపద్ములై
ప్రేమమెయిం గనుంగొని వరించి నుతించి వచించి రాతనిన్. 63

తే. నిఖలశాస్త్రపురాణముల్ నీదుసొమ్ము
నీ వెఱుంగనియితిహాస మీవసుమతి
నొక్కఁ డైనను లేదు మే మొక్కవిషయ
మడుగుచుంటిమి చెప్పవే యనఘచరిత. 64

శా. కృష్ణాతీరముచెంత మంగళమహాద్రిఖ్యాతమై పూతమై
విష్ణుక్షేత్ర మొకండు గల్గు నచటన్ వెల్గున్ నృసింహుండు వ
ర్ధిష్ణుండై నిరతంబు భూమిజనులున్ దివ్యర్షులున్ దివ్యులున్
జిష్ణుండు న్విధియున్ శివుండు నతనిన్ సేవింతు రిష్టంబుగన్. 65

వ. మఱియు నైమిశారణ్యము సాలగ్రామము పుష్కరము బదరికా
శ్రమము ననునాలుగువైష్ణవక్షేత్రంబు లుత్తరభూభాగంబునం
దును శ్రీరంగము శ్రీముష్ణము వేంకటాద్రి తోతాద్రి యనునాలుగు
క్షేత్రంబులు దక్షిణభూభాగంబునందును బరమోత్తమంబులై
కీర్తితంబు లగు నందుఁ జక్రినారసింహక్షేత్రం బుత్తమోత్తమం
బా క్షేత్రంబు తోతాద్రి స్తోత్రాద్రి యనియు మంగళాద్రియనియు
హ్రస్వశృంగి యనియు నమృతాద్రి యనియు ధర్మాద్రి యనియు
మోక్షాద్రి యనియుఁ బేరుల వ్యవహరింపఁబడు నందు నారాయ
ణుండు నరసింహేశ్వరుండు పానకాలరాయండు నాఁ బ్రఖ్యాతిం
గాంచి భక్తులకు భుక్తిముక్తు లొసంగుచుండునని వినుచుంటి
మావృత్తాంతం బంతయు సవిస్తరంబుగ నెఱుంగంజెప్పు మనిన
నక్కథకుండు వారి కిట్లనియె. 66

క. మీ రడిగినయీప్రశ్న మ
పారము నాతరము గాదు పలుకఁగ నైనన్
నేరిచినరీతిఁ దెలిపెదఁ
గోరికమెయి వినుఁడు మౌనికుంజరులారా. 67

శా. ఆతోతాద్రిమహత్త్వమంతయును ము న్నాబ్రహ్మవైవర్తవి
ఖ్యాతిం గొన్న మహాపురాణమున దుర్గాదేవి కీశుండు సం
ప్రీతిం జెప్పినయట్లు నాగురుఁడు పేర్మిం జేసి లోకంబులం
దేతన్మాత్రము నాఁగ రానిగరిమన్ హేమింపఁ జేసెం జుఁడీ. 58

వ. అది యంతయు నావిన్న తెఱంగునం దెలియఁ జెప్పెద సావధాన
చిత్తులరై వినుం డని యిట్లనియె. 69

సీ. ఒకకాలమునఁ బర్వతోత్తమకన్యక
పరమేశ్వరునిఁ గాంచి పలికె నిట్లు
దేవ భూతలమున దివ్యస్థలంబులు
కలవు స్వయంవ్యక్తము లని మున్ను
చెప్పితి రందులో శ్రేష్ఠతరంబులు
పొలుపొందు మంగళాచలము నాఁగ
వింటిఁ దచ్చరితంబు వీనులవిందు గా
విన నెంతు వినిపింప వేఁడుచుంటి

తే. అనిన శంకరుఁ డిట్లను నగజఁ గాంచి
దేవి! ము న్నాచరిత్రము దేవదేవుఁ
డగు మహేంద్రుఁడు దేవసభాంతరమునఁ
దెలిపె దాని నేఁ దెలిపెదఁ దెలియ వినుము. 70

—♦ నముచియను దానవుని చరిత్రము ♦—

చ. నముచి యనంగ దానవుఁ డనంతతపోనియమంబుపెంపునన్
గమలభవుం బితామహునిఁ గన్గొన నెంచుచుఁ బంచవహ్నిమ
ధ్యమున వసించి పెక్కు లగుహాయనముల్ గడుదీక్ష స్థాణురూ
పమునఁ గనంగ నయ్యెఁ ద్రిదివంబు గలఁగి చలించె నయ్యెడన్. 71

తే. తత్తపస్తాపమున నెల్లఁ దల్లడిల్లె
నపుడు మునులును వేల్పులు నజునికడకు
నరిగి తోతాద్రిపృష్ఠమునందు నముచి
యనెడు దైత్యుఁడు తప ముండె ననుచుఁ దెలిపి. 72

ఉ. వానితపంబు వేఁడిమి కవారిగ భూతచయంబు ప్రగ్గనై
జానఱి పోయె లోకములు సర్వజగజ్జనవల్లభా మముం
మానసమందు నెంచి కృపనైు భువనైకభయంకరోద్ధతుల్
బో నెద నాదరింపుమని మ్రొక్కుచు నుంటిమి దిక్కుఁ జూపవే. 73

వ. అనినఁ బ్రసన్నహృదయుండై పితామహుండు సరస్వతీసహితుండై దేవమునిసంఘంబుతోడం గూడి తృణగుల్మలతావృతంబును మృగపక్షిసమాక్రాంతంబునగు తోతాద్రికిం జనుదెంచి యట నొక్కచో సూచ్యగ్రంబునఁ బాదాంగుష్ఠంబు నిలిపి యూర్ధ్వబాహుండై భాస్కరుం బరికించుచుఁ దపించుచున్ననముచిం జూచి యిట్లనియె.

క. ఓయి తపోధన! వచ్చితి
నీయెడఁ గరుణించి నీదునిష్ఠకు నెంతే
నాయెడ సంతస మందెను
బాయక యర్థింపు మెట్టివరముల నేనిన్. 75

సీ. అనిన నాతఁడు నిచ్చి కనుదోయిఁ బరమేష్ఠిఁ
గని మ్రొక్కి యిట్లనుఁ గమలగర్భ!
ననుఁ గరుణింప నెంచిన వాఁడ వేని శు
ష్కము లార్ద్రములు పదార్థములదీప్తి
యుక్షరక్షోముఖు లగుదేవతలచేత
నరులచేఁ బశుపక్షిఖరమృగాది
జంతుసంతతులచేఁ జావు లేనట్లుగా
వర మొసంగుము నాకుఁ గరుణఁజేసి

తే. అనిన నౌఁగాతమని పల్కి యబ్జభవుఁడు
మునిగణాంచితుఁడై సత్యమునకుఁ జనియె

బ్రహ్మవరగర్వమునఁ జేసి రాక్షసుండు
ముజ్జగంబుల బాధింప మొదలు పెట్టె. 76

వ. వాని ఱాపులకు నోపఁ జాలక సర్వలోకంబులవారును క్షీరసాగర శాయి యగునారాయణునిపాలికిం జని ప్రార్థించి విన్నవించినఁ బ్రసన్నుండై పన్నగశయనుండు నే నారాక్షసు నుక్కడంచెద మీరు శంక దక్కి యుండుం డని వారి నంపిపుచ్చి దేవేంద్రుం బిలిచి నీ వీచక్రంబున నక్తంచరు నుక్కడంపు మని ఫేనావృతంబగుసుదర్శనంబు వానిచేతి కిచ్చి తాను నృసింహమూర్తియై యందుఁ జొచ్చె నంత నతండు సపరివారుండై ధారుణికిం జని నముచిం గని వానిపై నవక్రవిక్రమంబునఁ జక్రంబుఁ బ్రయోగించె నంతలోనఁ జక్రాంతర్గతుం డగు శ్రీహరి దీర్ఘనిశ్వాసంబు గావించుటయు దానం జేసి దానవుండు విగతజీవుండై తెగియె. 77

చ. అది యొకకొండయో యనెడు నట్టులు రాక్షసకాయ ముర్విపై
నదురు ఘటిల్లగాఁ బడియె నత్తఱి నెత్తురు వట్టువాఱె న
ప్పదమున రక్తకుల్య గన వచ్చెడు నప్పుడు నిద్ధ శౌరియుం
బొదలెను జక్రమధ్యమున మూఁడగు కన్నులతో నృసింహుఁడై.

— నృహరి పర్వతమున సుదర్శనగతుం డగుట —

వ. అయ్యెడ సర్వలోకభయంకరాకారుండై చూపట్టు చుట్టుకైదువు జోదుం గాంచి కంపించుచు నారదాదిమహర్షులును దేవేంద్రాది దేవతలును బ్రహ్మరుద్రాదులును భయభక్తి భరితాంతరంగులై.

సీ. సర్వదేవేశ్వరేశ్వర! లోకరక్షకా!
నీ కేటికో శ్లీవే నీరజాక్ష
యజ్ఞేశ మాధవా! యఖిలజనార్దన!
సుప్రసన్నుఁడ వయి చూడు మమ్ము
దేవ నీదగుకటాక్షావలోకములకు
మేము పాత్రుల మయి మెలఁగుచుంటి
మచ్యుత! నానావిధావతారంబుల
నెత్తి రక్షింతు వీవెల్లప్రజల

తే. నీమలీల లనంతము లాదిపురుష
నిన్ను నీరూపమును జూచి నెగులు గుడుచు
చున్నవా రెల్లరున్ వారి నోమ వయ్య
భక్తపాలక! నీ కిదే వందనంబు. 80

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై సుదర్శనాంతర్గతుండగు నృకేసరి
వారిం గాంచి యి ట్లనియె. 81

శా. ఏ నీపర్వతరాజమందు సతతం బీరూపముం దాల్చి లో
కానీకంబుల నేలుచు న్నిలువఁగా స్వాంతంబు గావించితిన్
గాన న్నీ రిట నన్నుఁ గొల్చి భయముం గానంగఁ బో కుత్సుక
త్వానందంబును బొందు చుండు డని సద్వ్యాహారముం జేయుచున్.

తే. వెండియుం బల్కె నిట్లు లోవేల్పులార
మునులు సేవింప నే నిట మొనయుచుండు
మీరు దివి కేగి స్వర్ధునివారి నాడి
యమృతముం గొనిరండు నే నారగింతు. 83

వ. అని పలికి శాంతుండయ్యె నంతలోన దేవతలు దేవలోకంబున
కేగి యమృతంబు దెచ్చి సమర్పించుటయు దేవదేవుండు దాని
నర్ధం బారగించి శేషార్థ మర్థు లగు భక్తుల కొసంగె నిట్లు ప్రతి
దినంబును సపర్య లగుచుండె న క్లాదియుగంబున నమృతంబును
త్రేతాయుగంబున నాజ్యంబును ద్వాపరయుగంబున క్షీరంబును
గలియుగంబునఁ బానకంబు నీశ్వరాదేశంబున నైవేద్యంబు
గావించి శేషంబు భక్తు లాస్వాదింతు రని మఱియును. 84

మ. గిరిపై స్వామికి శీర్షభాగమున సంకీర్తింప నై మెట్టిపోఁ
దరమై పెన్గుహ యొక్కఁ డుత్తరదిశం దళ్కొత్తు నం దింతద
వ్వరుగం బంచముఖంబు లయ్యెనది తద్ద్వారంబులన్ సత్తపో
గరిమం దేలుచు నెందఱో ఋషివరుల్ గానంగవత్తు ర్దరిన్. 85

—♦ ఉండవల్లిగుహా వృత్తాంతము. ♦—

ఉ. ఆగుహ కృష్ణవేణికడ నచ్చెరువుం గలిగించునుండవ
ల్లిగుహ శేషశాయికడకున్ లీలన్ విరాజిల్లుచున్

భాగవతమై కనుంగొనఁగఁ బోలెడు నంచు మునీంద్రు లందునన్
భాగవతప్రసంగము లొనర్చుచు నుందురు వచ్చిపోవుచున్. 86

క. మంగళగిరిలో స్వామికి
నంగుటిలోఁ బోసినట్టియప్పానములో
సంగతిగ నుండవల్లగు
హం గలిగినదేవుపాల నగపడుచుండున్. 87

సీ. అమ్మంగళాద్రిఁ బ్రత్యక్షమాహాత్మ్యము
చూపఁజాలు నేఁడు చూడ వచ్చు
గర్భాలయమ్మునం గాక ప్రాంతమ్మున
నలుగడల గుడంబు నలఁగఁ గొట్టి
పానక మొనరించుభాగము లందును
జితచితలాడుచు జిరుగు గలిగి .
బెల్లపునీ రంటు విడకుండఁ గాళ్లకు
నీఁగ గా నొకచీమ యేనిగాని

తే. చేరగా రాదు శ్రీనారసింహునాజ్ఞ
నచటఁ బడి యెట్టిప్రాణియు నసువు విడదు
పాదములఁ గల్గువ్రణము లాపానకంబు
జిగురు దగిలినమాత్రాన నొగి నశించు. 88

ఆ. ఆదియుగమునుండి యమరమునీంద్రులు
నఖిలజనులు మంగళాద్రిన్నృహరిఁ
గొలిచి భుక్తిముక్తి లెలమిఁ గాంచుచునుందు
రది పరమపదంబ యయ్యె నవని. 89

వ. సాక్షాద్వైకుంఠంబు నా నొప్పు నప్పర్వతరాజంబు మునుమున్ను ప్రాస్వశృంగి పిదపఁ దోతాద్రి వెనుక స్తోత్రాద్రి ముక్తిపర్వతము ధర్మాద్రి మంగళాద్రి యనునామంబులఁ గీర్తనీయం బయ్యె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పుమని సూతు నడుగుటయును. 90

## ఆశ్వాసాంతము

శా. శ్రీశ్వేతాద్రి నృసింహమూర్తికరుణన్ జేకొంచు గుంటూరిలోఁ
బ్రీతిన్ గాపురముండి బంధుతతులన్ బ్రేమించి శ్రీమించునా
సీతారామయఁ గన్నతండ్రి యగు లక్ష్మీనారసింహుండు వి
ఖ్యాతాభిఖ్య నెసంగుచుండు నెపుడున్ గల్యాణసంపద్గతిన్. 91

## గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ కవి
సార్వభౌమ ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన
మంగళగిరి మాహాత్మ్యంబునందుఁ
ప్రథమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

# మంగళగిరిమాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

—:—

క. శ్రీలక్ష్మీనరసింహుఁడు
లీలన్ దోఁతాద్రి వెలసి లేఖస్తుతుఁడై
శ్రీ లక్ష్మీనరసింహుని
శ్రీలున్ సంపదలు నొసఁగి చేకొని ప్రోచున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు నముచికారణంబున శౌరి నారసింహుండై మంగళాచలంబునఁ జక్రమధ్యగతుండై యున్నంతఁ గొంతకాలంబునకు. 2

— జయ విజయులకథ —

చ. జయవిజయాఖ్యు లిర్వు రనిశంబు రమాధవపార్శ్వవర్తులై
భయమును భక్తియుం గలిగి ప్రస్తుతికెక్కఁగ నుండ నొక్కనాఁ
డయ మొదవంగ నప్పురుషు లప్పురుషోత్తమమందిరంబునన్
నియమితులై మెలంగిరి వినీతమతి న్మొగసాలఁ గాచుచున్. 3

క. అపుడు దిగంబరరూపము
సుపరిష్కృతమగుచునుండఁ జూడఁగ నైదేం
డ్లపడుచు లో యన సనకా
దిపరంతపు లచటి కేగుదెంచిరి కడిమిన్. 4

తే. లోపలికిఁ జొచ్చి చనునంతలోన నచట
ద్వారపాలకు లాఁగి రవ్వాలకుఁ జొరఁగ
నీక హరిశాసనముఁ గాన నింతమాత్రఁ
గనలి వారలఁ గని వారు కటకటపడి 5

ఉ. మేము సమస్తలోకముల మెట్టుచు నిట్టియెడన్ రమాధవుఁ
బ్రేమమెయిం గనుంగొనెడువేడుక పెంపున వచ్చినార మా

హా! మదవృత్తి మీరు మము నాఁగితి రందునఁజేసి వాసవో
భూమి నపాత్రగర్భమునఁ బుట్టుఁడు గిట్టుఁ డటంచుఁదిట్టుచున్.
మ. మదమాత్సర్య విగర్హితాత్ములగు మీగ్రామనాథునిం బొంది యి
ప్పదమం దుండఁగ రాదు వీడి మదిరాపానప్రమత్తాసురీ
పదదాస్యం బొనరించునట్టి రగుచున్ వర్తింపుఁడీ యంచు నా
విదితాత్మ ల్సనకాదిసంయమివరు ల్వీచ్చేసి రిచ్ఛాగతిన్. 7
తే. అంత వారు పదభ్రష్టు లగుచుఁ గుయ్యి
వెట్టి కూలెడునప్పు డావిష్ణు వెటేఁగి
మూడుజన్మముల నైవ్వైరమునను నన్ను
మరలఁ బొందెద రని పల్కి కరుణఁ జూపె. 8

—♦ జయవిజయులు హిరణ్యాక్షహిరణ్యకశిపులగుట ♦—

వ. శాపోపహతు లగువా రిరువురును భగవత్సన్నిధానంబునకుఁ దప్పి యప్పుడు భూతలంబున దితికని గశ్యపప్రజాపతికినిం బుట్టి హిరణ్యకశిపు హిరణ్యాక్షులనం బొలిచి కాలక్రమంబున గండుమిగిలి జగత్కంటకులై ప్రవర్తిల్లి రందు. 9
మ. అరయన్ లోకభయంకరుం డగుహిరణ్యాక్షుండు తా గ్రమాక్షుఁడై
పరిపంథిప్రకరంబులన్ రణమునన్ బల్మాఱు నిర్జించి తా
ధరణీచక్రముఁ జాపచుట్టి జలధిన్ డాఁగె న్మహాోపప్లవం
బరుదై తోఁప వరాహరూపమున దున్మాడె న్విభుం డాతనిన్.
తే. అనుజుని న్సూకరాకారుఁ డైనశౌరి
వైరమునఁ జంపె నని విని ఘోరరోష
వహ్నిదందహ్యమానహృద్వర్ష్ముఁ డగుచుఁ
గనలి ఘూర్ణిల్లుచు హిరణ్యకశిపుఁ డపుడు. 11
వ. జటాసముత్పాటనామరితహర్యక్షాధ్యక్షునింబోలి పెల్లు గర్జిల్లి నిటలతట ఘటితకుటిలభ్రూకుటియై కటంబు లదరఁ బండ్లు పటుపటం గొఱుకుచుఁ బ్రళయానలజ్వాలాజాలంబునుం బోని శూలంబు కేలం ద్రిప్పుచు నిజసభాభవనంబున నిలువంబడి శకుని శంబర శతబాహు త్రిమస్తక త్రిలోచనాదిమంత్రి వర్గంబులం గని. 12

## —♦ హిరణ్యకశిపుని పరాక్రమము ♦—

ఉ. ఎమ్మెలు మీఱ లోకముల నెంతయుఁ బంతముతో మెలంగు నా
తమ్ముని సూకరంబగుచు దైత్యవిరోధి విరోధ మాత్మలో
ముమ్మరమై కలంచుటను బొంచి వలంచి వధించె నంట నే
నెమ్మెయిఁ దాళియుండఁ గల నీపగఁ దీర్పక పేర్పు కిం కిటన్. 13

శా. పాతాళంబునఁ దూఱెనే మఱి నభోభాగంబునం బాఱెనే
స్ఫీతాంభోనిధి డాఁగెనే దిసల కుద్వేగంబుమై నేగెనే
భూతప్రేతపిశాచశాకినులతోఁ బోరాడఁగా మూఁగెనే
నేతన్మాత్రములోన నాహరిఁ గిరిన్ హింసించి యేతెంచెదన్. 14

క. కరవాలధారఁ దునిసిన
హరికంఠమునుండి వెడలునస్రప్రతతిన్
మరణించినసహజునకున్
బరఁగం దర్పణము సేసి వడి శాంతింతున్. 15

చ. మునులు మఖంబులు న్సురలు భూసురులుం దపము ల్జపంబులున్
ఘనకృతులున్ శ్రుతు ల్వ్రతులు గాఁగలకార్యములెల్లఁ జక్రిపై
తనరెడు వానియం దతఁడు తద్దయు మగ్నుఁడు గానఁ దద్వినా
శనమునఁ దద్వినాశన మసత్యముగాదు నిజంబు చెప్పితిన్. 16

తే. మీరు మీమీదళంబులఁ గూరుచుకొని
క్రమ మరయఁ బోవ కాయాస్థలముల కరిగి
మించి విక్రమమున విజృంభించి ముజ్జ
గముల ధ్వంసంబు గావింపఁ గడఁగు డిపుడు. 17

వ. అని నుడికారం బెసంగ నాజ్ఞ యొసంగిన వారు నపారసేనావార
పరివృతులై కదలి. 18

మ. పరమర్షి ప్రకరంబులం దఱిమి విప్రవ్రాతముం దోలి మే
ల్పురము ల్గాలిచి గోపురంబులును గుళ్ళుం గూర్చి గోసంఘముల్
మరణంబందఁగఁ జేసి యజ్ఞకృతుల న్మర్దించి దిక్పాలురన్
సురలన్ స్రుక్కఁగఁ జేసి ముజ్జగంములన్ దూలించి రత్యుద్ధతిన్.

వ. హిరణ్యకశిపుండును దానుసర్వసమర్థుండయ్యుఁ దనకజరామరణత్వం
బులును నప్రతిహతశూరత్వంబును ద్రిజగద్రాజ్యవిభుత్వంబునుం
గోరి. 20

## హిరణ్యకశిపుండు తపించుట

ఉ. ఏయవి చేయరానిపను లేయవి పొందఁగ రానికోర్కులో
యేయవిదాఁటరానిగిరు లేయవియీఁదఁగరానియేఱులో
యాయవియెల్లఁ గన్దెఱచునంతటిలో నెఱవేర్పవచ్చు నిం
దాయజుసత్కృపారసము నందుఁ దపంబొనరించువారికిన్. 21

వ. అని నిశ్చయించి మందరముసకుం జని యందుఁ గామ క్రోధ
లోభ మోహ మద మాత్సర్యంబులు విడనాడి దయా సత్య శౌచ
బ్రహ్మచర్య క్షమార్జవ ధృతి మితాహారాది మహాగుణంబులం
గలిగి యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన
ధారణ సమాధులం దగిలి యతవ్రతంబున నొక్కచోఁ జతుర్దిగంచి
తాగ్నికుండంబుల మహాగ్నిజ్వాలలు నిగుడఁ దన్మధ్యంబునఁ గాలి
పెనువ్రేల నేల నిలువంబడి యూర్ధ్వబాహుండై ప్రభాకరబిం
బంబుపై నంబకం బిడి ప్రళయకాలహుతాశనునియాకారంబున
నేరికిం దేఱిచూడ రాక బహిరింద్రియవ్యాపారంబులం దెగడి త్రైలో
క్యసంతాపకరం బగునట్టి దారుణతపం బొనరింపం దొడంగె. 22

చ. జడధులు వట్టిపో నిఖిలసస్యములుం జెడిపో దవాగ్నితోఁ
దొడుసుగఁ గాయు నెండలకుఁ దోడ్పడుచు న్వడగాలి గొట్టుచో
మిడమిడలాడు వేసవిని మే న్గడు నాపదమస్తకంబు గా
నుడుకఁ గృశానుమధ్యమున నుండి తపించెనతండు మెండుగన్.

ఉ. ఉండినచోట నుండి మఱి యొండొకచోటికిఁ గాలు మెట్టిపో
కుండఁగఁ ద్రాచులం జదల నొత్తుగ వ్రేలఁగఁ గట్టినట్టు నీ
రుండలఁ గ్రుమ్మరించునటు కొట్టెడువార్షికవాసరంబులన్
బండల నుండి వెల్బయట బాఢతపం బొసరించె నెంచఁగన్.

చ. చదలునఁ బుట్టి కోలుపులి చందమునం బఱతెంచి మంచు భూ
షదమున నెల్లెడం బ్రబలి పైఁబడఁ బాఱుడు నట్టివారినే

వదవద లాడఁజేయుహిమవత్సమయంబున గొంతుబంటిగా
నదులజలంబుల న్నిలిచి నాకవిరోధి తపించె మించఁగన్. 25

వ. ఇ ట్లధికనిష్ఠాగరిష్ఠుండై యనేకదివ్యవర్షంబు లనన్యసామాన్యంబుగ
నత్యుగ్రతపంబు గావించె నంత. 26

మ. ధర గంపించెఁ బయోనిధు ల్గలఁగెఁ బాతాళంబు ఛేదిల్లె ది
క్కరులున్ మ్రొగ్గె ననంతుఁడున్బడియెరిక్కల్ రాలె భూమీధ్రము
ల్వ్రీలెన్ విష్ణుపదంబు వేలి పగిలెన్ వేవెల్గు రేవెల్గునుం
దిర మేదం గతి దప్పి రెల్లకడలం దీపించెఁ బెంజీఁకటుల్. 27

చ. కడిమిఁ జరాచరాత్మకజగత్త్రియ మల్లతపోనలంబునన్
బడిబడి మండఁబాఱుడు సుపర్వప్రముఖ్యులు సత్యలోకమున్
వడిఁ జని యందు దేవమునివర్గము గొల్వఁగ భూతసర్గమున్
నడపెడునబ్జజుం గని వినమ్రిత దోఃపఁగ మ్రొక్కి చక్కటిన్. 28

చ. తెలియు ననుగ్రహింపు మిటు దీనులమొఱ్ఱలు దేవదేవ! పెం
పులగవిదై హిరణ్యకశిపుం డను దైత్యవరేణ్యుఁ డుర్వి ని
శ్చలమతియై మహాతపము సల్పుచు నుండెను దానివేఁడికిన్
మలమల మాఁడిపోతి మిఁక మాగతి యేమి? వచించి ప్రోవవే. 29

వ. అని విన్నవించుసురశ్రేష్ఠులకున్ సురజ్యేష్ఠుం డి ట్లనియె. 30

క. సురలార నే నెఱుంగుదు
సురవైరి యతండు నన్ను స్తుతియించి తపం
బరుదారఁ జేయుచుండెను
వరముల నిడి వానితపము వడి నుడిగింతున్. 31

వ. మీ రింక నంతరంగంబులఁ జింతదక్కి యుండుం డని వారి నెల్లర
నంపిపుచ్చి డా నొక్కరుండ హంసవాహనారూఢుండై మందరంబు
నకు వచ్చి బాహ్యేంద్రియవ్యాపారశూన్యుండై తపంబున్నహిరణ్య
కశిపుఁ గని బోధించుచుం ద న్నెఱింగించి యి ట్లనియె. 32

—♦ బ్రహ్మ హిరణ్యకశిపునకు వరంబు లిచ్చుట ♦—

చ. కటకట మీఁదితో ల్చిదికి కాయ మపాయముగా నెఱుంగ కి
త్తటమున నింతకాలము నుతం బగుభంగి మహాతపంబు ప్ర

స్ఫుటముగ నన్నుఁ గూర్చి శ్రుతిచోదితమార్గమునం బొనర్చి తీ
వ్రెటుల సహించితో వెతల కీలుగ నైతివి జాలి వుట్టెడున్. 28

క. వేఁడుము వర మిచ్చెద నీ
వేడుకకుం దగ మునీంద్రవినుతవిచారా
మూఁడుజగంబులలో నీ
కీ డెవ్వఁడు మెచ్చినాఁడ నీతపమునకున్. 29

వ. అనిన నతం డల్లనఁ గన్నువిచ్చి యప్పితామహునకు సాష్టాంగ
నమస్కారంబు గావించి. 30

చ. కలితచరాచరాత్మక జగత్త్రియసృష్టివిధానహేతువై
వెలసిననీవు వేలుపులవేలుపవై వెలుఁగొందుచుండు నీ
సలలితరూపదర్శనము సర్వఫలప్రద మేను ధన్యుఁడన్
గలిగెను నీకు నాపయి నఖండకృపారస మోపితామహా. 31

వ. అది కావున. 32

క. అమరేంద్రత్వముఁ గోరితి
నమరత్వముతోడ మఱియు నప్రతిహతశౌ
ర్యముఁ ద్రిజగద్విజయము నిడు
మమరార్చిత! కరుణ గలిగెనా నామీఁదన్. 33

తే. అనుఁడుఁ జతురాననుం డను నసురనాథ
నీకు నమరాధినాథత్వ మేకఱ వగు
నోయి? యసురాధినాథత్వ ముండెఁ గాదొ?
పెద్దవడ దది దీనికి బుద్ధి నరయ. 34

వ. అని ప్రత్యాఖ్యానమ్ము చేసిన దానికి దితిసుతుండు తనలోఁ దాను
గర్హించుకొనుచు మఱియును. 35

చ. వల దమరేశ్వరత్వ మది వాగధినాథ! సురాసురాళిచేఁ
జెలఁగెడునస్త్రశస్త్రములచే మృగకోటులచే నరాళిచే
జలముల నేల గాలిని గృశానువునన్ దివి రేఁబవల్ల ది
క్కుల మృతిలేనియట్లు దయకుం దగ నిమ్ము వరమ్ము వేఁడెదన్.

—♦ హిరణ్యకశిపుఁడు విజృంభించుట ♦—

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేష్ఠి వాని కావరం బొసఁగి సిద్ధమునిసంఘంబులు గొలువ నిజమందిరంబునకుం జనియె హిరణ్యకశిపుండును హిరణ్యగర్భదత్తవరగర్వదుర్విదగ్ధుండై. 37

చ. బలములు గొల్వ లోకములఁ బర్వినసర్వసుపర్వముఖ్యులన్
బలమదనిర్జితారు లగుపార్థివముఖ్యుల నాగముఖ్యులన్
గెలిచి రణాంగణంబుల సుకీర్తి వహించెఁ బరాక్రమంబు ది
క్కులఁ గలయంగఁ బర్వఁ దనకుం బ్రతి లేక జగత్త్రయంబునన్.

సీ. ఇంద్రలోకము జేరి యింద్రుని నోడించి
యగ్నిలోకముఁ జని యగ్ని గెలిచి
యమలోకమున కేగి యముని వినిర్జించి
నిరృతిలోకముఁ జేరి నిరృతి నొడిచి
వరుణలోకముఁ జని వరుణునిఁ గరుణించి
పవనలోకముఁ గని పవనుఁ ద్రోలి
ధనదలోకముఁ జూచి ధనదునిఁ దూలించి
రుద్రలోకము నొంది రుద్రుఁ గదిసి

తే. మఱియు బ్రహ్మవిష్ణ్వాదులఁ దిరిగి గెలిచి
తనర నీరేడుజగములు తనవశంబు
గాఁగఁ గైకొని యేరికిఁ గాక కండ
కావరమ్మునఁ దిరిగె నాదేవవైరి. 39

—♦ సురలు వైకుంఠమున కరుగుట ♦—

వ. ఇట్లు పరాక్రమంబు మెఱయ నధికవైభవంబున నాధివ్యాధిజరామరణేతిబాధారహితం బగునట్లు నిష్కంటకంబుగా నిఖిలలోకంబు లేలుచు నింద్రాదుల కింద్రుం డయి గండుమిగిలి యుండునంత నింద్రాదిబృందారకు లెల్ల నారాతుసేంద్రునిబారిఁ బడి తప్పించుకొనుట కేయుపాయంబుం గానక మిగుల వగలఁ బొగులుచు సర్వలోకశరణ్యుం డగు నారాయణదేవు శరణంబు వేఁడుట మన

కిపుడు కర్జం బని సర్వభావంబులం దలంచి యొక్కనాఁ డుదగ్గిశాభి
ముఖులై చని చని ముందట. 40

మ. కని రావేల్పు లనల్పకౌతుకమునం గళ్యాణరత్నప్రభా
జనితాహ్లాదము సంభృతామృతరసస్వాదంబు చంద్రాదిపా
వనదాయాద మతిప్రసాద మపనిర్వాదమ్ము సుశ్రీదముః
వినిరూఢోన్నతనాద ముద్ధృతమహావేదమ్ము క్షీరోదముః. 41

వ. ఇట్లు కనుంగొని వా రప్పయోనిధ్యనుభావంబునకు నద్భుతామో
దంబునం బొందుడెందంబులఁ బొందుగఁ బొగడుచు మందగమనం
బంగీకరించి. 42

చ. హరి యిట నున్నవాఁడు నెనరార మిముం గరుణించు రం డటం
చురుతరమారుతోద్ధతమహోర్మిసుహస్తపరంపరాధికో
త్తరళితసంజ్ఞ ఘూర్ణిత ముదాత్తఘనస్వరవాక్ప్రసక్తి గాఁ
బెరిమ నితం డొగిన్మనలఁ బిల్చెడు నాఁ బొలుపొందుఁ గంటిరే. 43

వ. ఇ ట్లన్యోన్యవాక్ప్రసంగంబుల రంగదభంగతుంగతరంగపరంప
రాతి శృంగారం బగునయ్యంబునిధి ననేకభంగులం గొనియాడుచుఁ
గొంతద వ్వరిగి తన్మధ్యంబున ననేకశతసహస్రకోటియోజనవిశాల
భాజనంబై శ్వేతద్వీపంబు దీపించు నదియును. 44

—♦ వైకుంఠపురవర్ణనము ♦—

చ. తరగలరాపిడిం బొడమి తద్దయు ముద్దగఁ జేరి పేరి పెం
పర మయి పాలవెల్లినడుమం దవు వెన్నయె వెల్లదీవి యై
తిరపడె వెన్క వేల్పు లుదధి న్మథియింపఁగ నోసుధారసం
బరుదుగ నాఁడు దానిపయి నారి పరంగె మెఱుంగుపూఁత యై. 45

వ. అమ్మహాద్వీపమధ్యమ్మున. 46

మ. అరుదార న్మణిభర్మనిర్మితమహాహర్మ్యప్రభాపుంజమున్
వరణస్థాపితనూత్నరత్నరుచివ్రాతంబునుం గూడి భా
స్కరకోటిద్యుతులః హసించుచును వేడ్కం బొల్చి వైకుంఠ మ
న్పురరాజంబు విరాజమాన మగు సంపూర్ణప్రభావంబునన్. 47

నసలుఁ డంధఃకరుండై రసవంతంబు
గా వండిపెట్టు రాక్షసునియింట
జముఁ డనాయుష్యుని జను నైనఁ గొంపోక
నివ్వెఱ వరవుళ్ళ నిలిచె నచట
నిర్ఋతియు బెదరి నే నీవాఁడఁ జూ యని
సేవించు నానల్లఁద్రావువాని

తే. వేఁగ ననయం బపాంపతి వోఁగ ధూళి
యల్లధర్మతి వాకిళ్ల నీళ్లు చల్లు
నీఁద వానికి వీచోపు లిడుచునుండు
శ్రీదుఁ డీశానుఁడును వానిఁ జేరి మనిరి. 58

తే. ఇంద ఆవ్విధమున నిచ్చ లేమరకయ
సాధ్వసాతిశయావృతస్వాంతు లగుచుఁ
గన్ను సన్నల మెలఁగుచు నన్నిపనులు
తీర్చుచుండిన బలువంత గూర్చుచుండు. 59

వ. దీనరక్షకా! భవద్రక్షకం బగునిజ్జగత్త్రయంబునకుం గలిగినగురుతరోపద్రవం బుడిపి త్వదేకశరణ్యుల మగుమమ్మగణ్యానుకంపాతిశయమ్మునం గాచి రక్షింపవే యని యనేకవిధంబుల వేడికొనిన విని భక్తలోకపరాయణుం డగునారాయణుండు ప్రసన్నుండై వారి కిట్లనియె. 60

తే. ఎఱుఁగుదు హిరణ్యకశిపు వాఁ డెఱుక విడిచి
బహ్మవరగర్వమునఁ జేసి ప్రబలుఁ డగుచు
జగము లేర్చుచునున్న వాఁ డొగిని వాని
సదమదము సేయ యత్నింతు శంక విడుఁడు. 61

వ. అని వారినెల్ల నంపిపుచ్చి యచ్యుతుండు దైత్యవధోపాయం బంతరంగంబునఁ జింతించి యంతరం బరయుచుండె నంత నక్కడ. 62

మ. అజరుద్రాచ్యుతు లంతవారి నయినన్ స్వాంతంబునం దెన్న కే
విజయంబుం గొని యక్షరాక్షసమరుద్విద్యాధరాద్యాజులన్

ద్రిజగన్నాథుండ వై ప్రభుత్వగరిమన్ దీపించు దైత్యేశ్వరుం
డజితుండై చరియించె నెల్లకడలం దవ్యాహతప్రజ్ఞుఁడై. 63

వ. ఇట్లు మహోన్నత్యంబున దితిసుతుండు తేజరిల్లుచున్నసమయంబునం
గొంతకాలంబునకు. 64

—* లీలావతికి ప్రహ్లాదుండు పుట్టుట *—

ఉ. ఆవిబుధారిదేవి విబుధాంగనలు న్మతి పన్నగాంగనల్
భూవలయాంగనల్ తనకు ముచ్చట లెచ్చఁగ నూడిగంబు సం
భావనమీఱ జేపులును మాపులునుం బొనరింపఁ బెంపునన్
దా విలసిల్లి యెల్లరు ముదంపడ గుర్విణి యయ్యె నయ్యెడన్. 65

క. నెల దప్పెఁ గోర్కి లొప్పెను
బలుకులు నడకలును జాల బడలికఁ జెప్పెన్
బలువేవి ళ్ళొగిఁ గప్పెను
వెలవెలనై మోము కళలవిప్పుం గుప్పెన్. 66

క. అలరెడు తేజముతోడన్
వెలుగొందెడుకొడుకు లోన వెలసినకతనన్
నెలఁతుకయొడ లయ్యెడలం
దళతళ మనుకాంతి నలరెఁ దగఁ బరికింపన్. 67

ఆ. అట్లు నీరుమోసి యైదాఱునెల లైన
వెనుకఁ జక్రధరుఁడు వెలఁదిమిన్న
కలను బోలఁ దోఁచి గర్భస్థుఁ డగుసర్భ
కునకు బోధపఱచి చనియె నిచ్చ. 68

మ. నవమాసంబులు నిండ నంతఁ ద్రిజగన్నాథోప దేశంబునన్
భువనాతీతమహత్త్వతత్త్వవిలసత్పూర్ణ ప్రభావంబునన్
బ్రవరుండైనకుమారుఁ డారమణికిన్ భాస్వన్మహాలగ్నమం
దు వగం బుట్టెను సర్వలోకములు సంతోషంబునం గ్రాలఁగన్. 69

వ. హిరణ్యకశిపుండును బుత్త్రోదయంబునం ద్రిజగంబులందును మహోత్సవంబు చాటించి బంధుమిత్త్రామాత్యపరివృతుండై శుక్రాచార్యోక్తక్రమంబున నాత్మజాతునకు జాతకర్మాది సంస్కారంబులు నిర్వర్తించి సకల జగత్ప్రహ్లాదుం డగుటం జేసి ప్రహ్లాదుం డని నామకరణంబు చేసె నంత నా ప్రహ్లాదుండును. 70

## —♦ ప్రహ్లాద చరిత్రము ♦—

సీ. కదలఁడు మెదలఁడు కమలేశ్వరుని లోన
సేవించుచున్నట్టి జీవి గాన
నవ్వఁడు త్రుళ్ళఁడు నారాయణుని లోనఁ
స్మరియించుచున్నట్టి జ్ఞాని గాన
నాఁ యనఁ దూఁ యనఁ డఖిలాండపతి లోనఁ
గీర్తించుచున్నట్టి మూర్తి గానఁ
జూడఁడు పలుకఁడు సురరక్షకుని లోనఁ
జూచుచుండినయట్టి సూరి గాన.

తే. బడఁడు లేవఁడు విద్దెము లిడఁగ బోడు
తినఁడు త్రావఁడు సుద్దుల వినఁగఁ బోఁడు
లోకరక్షకుఁ డైనలక్ష్మీకళత్రు
లోన ధ్యానించుచుండిన మౌని గాన. 71

వ. ఇట్లాదైత్యకుమారుండు శుక్లపక్షసుధాకరుని చందంబున దినదిన ప్రవర్ధమానుం డై. 72

సీ. కలనైన నన్నృతంబు పలుకఁడు జంతుహిం
సాకర్మ మనఁగనే శౌరిఁ దలఁచు
నవివేకు లభిముఖు లైన మాటాడఁడు
వృథగ వాగ్వ్యయము గావింపఁ బోఁడు
శత్రుమిత్త్రుల నొక్కసమతమైఁ జూచెడుఁ
బరులబాధలు చూచి పరితపించు

జననమరణము లసహ్యంబు లని యెంచు
నిహసుఖం బన్నచో నేవగించు

తే. భూజలస్థములై యొాజఁ దేజరిల్లు
జంగమస్థావరంబులసంఘమందుఁ
బరమగురుబుద్ధి నిలిపి తాఁ బరఁగుచుండుఁ
బంచవర్షవయస్కుఁడు బాలకుండు. 73

వ. అంత హిరణ్యకశిపుం డాబాలునకు యథాకాలంబుగఁ జౌలోప
నయనాదిసంస్కారంబు లొనరించి విద్యాభ్యాసము సేయింప గురు
కులంబునకుం బుచ్చుటయు నతం డచ్చట. 74

—♦ ప్రహ్లాదుని విద్యాభ్యాసము ♦—

చ. పరమహితోపదేశ మిది భక్తిమెయిం బఠియింపు మంచు న
గ్గురువరుఁ డొండు చెప్పిన నొకొండు విను న్మతిఁ దొయిండువల్కు లో
నరయు నొకానొకం డనఘుఁ డవ్యయుఁ డచ్యుతుఁ డప్రమేయుఁ డా
హరి యుదరాంతరాళమున నంతయు నిండి వెలుంగు చుండుటన్.

వ. మఱియును. 76

సీ. చదివింపఁ బోయినఁ జదువ నొల్లం డొజ్జ
చదివిన చదువెల్లఁ జట్టు పడఁగఁ
బాడింపఁ బోయినఁ బాడ నొల్లం డొజ్జ
పాడెడు పాటలు పదటఁ గలియ
వ్రాయింపఁ బోయిన వ్రాయ నొల్లం డొజ్జ
వ్రాసినవ్రాఁతలు మాసి పోవఁ
బలికింపఁ బోయినఁ బలుక నొల్లం డొజ్జ
పలికినపలుకులు బయలు పట్టఁ

తే. దన్నుఁ గూరిచి యిట్టు లాదైత్యగురువు
పాటుపడుచున్నఁ జెప్పిన మాట యొకటి
వినఁడు చదువఁడు పలుకఁడు కనఁడు వినఁడు
భక్తిఁ బరవశుఁ డాదైత్యబాలకుండు. 77

వ. ఇట్లు వాసనావశంబునం జేసి పరమవైరాగ్య భాసమానహృదయాబ్జ కోశంబున శ్రీవాసుదేవచరణాబ్జయుగళంబు నిలిపి సర్వంబును మఱచి తదేకధ్యానపరాయణుండై సవయస్కులైనసహస్రోతలం గూడి విద్యాభ్యాసము చేయుచున్నవాఁడు వోలెఁ బ్రవర్తించె నంతఁ గొంతకాలంబున కాదైత్యకులశేఖరుండు తనతనయుం డెట్లు పఠించుచుండెనో గురువు లెట్లు పఠింపించిరో చూచెదం గాక యని పిలువంబంచి తనయుత్సంగబునం దనయుఁ గూర్చుండం బెట్టుకొని ముద్దులాడుచు ని ట్లనియె. 78

చ. చదువు జగత్త్రియంబున యశం బిడుఁ గాన గురూక్త మాగతిం
జదివితె లోకముం దెలియఁ జాలినవిద్దెల ముద్దుపట్టి! నీ
చదివినదంతయుం గురులసన్నిధి విన్నప మాచరించి నా
మదికి ముదంబు గూర్పవె సమస్తజనంబును సన్నుతింపఁగన్. 79

వ. అని యి ట్లుపలావించుచున్న సమయంబున సకలజనాహ్లాదకరుం డగు ప్రహ్లాదుండు తండ్రి కి ట్లనియె. 80

శా. సర్వజ్ఞుం డగు నీశ్వరుం దెలిసి విజ్ఞానంబునం దోఁగుచే
నేర్వన్ విద్యలకున్ ఫలం బగును గానీ కీర్తి నొందంగఁ గా
దుర్విన్ గర్వి నశించుఁ గావునను నేనో విద్యల నేర్చితిన్
"సర్వం విష్ణుమయం జగ" త్తనుచు నశ్రాంతంబుఁ జింతించుటల్.

ఉ. ఆగమముల్ బడి న్నుడువు నాదియు నంతము లేక లోకముల్
వీఁగక సృష్టిచేసియును బెంచియుఁ దుంచియు లీల నాడుచున్
దా గతియై మెలంగెడు నుదారత నచ్యుతుఁ డంచుఁ గాన నా
యోగివరేణ్యునిం దెలియు టొక్కఁ డెఱింగితిఁ దండ్రి! విద్యలన్.

వ. అని పలుకన్ డిల్లపడి యుల్లంబునం గలయుల్లాసం బదియెల్ల నాసి రిల్ల దనుజవల్లభుం డల్లనఁ బ్రహ్లాదున కి ట్లనియె. 83

చ. అరయఁగ నీచరిత్ర మిది యంతయు వింతగఁ దోఁచె నక్కటా
పరులెవ రిట్లు నీమదికిఁ బట్టఁగఁ జేసిరి కోడెకాఁడ వీ
విరసము లెట్లు నేర్చితివి వెన్నుఁడు దానవజాతి కంతకుం
బరమవిరోధి వాని నిటు పాడి చెడంబడ నేటి కాత్మజా. 84

వ. అని పురోహితునిం బరికించి. 85

చ. గురువులు మీరు మాకుఁ గడుఁ గూర్చినవారలు మిమ్ము మే మెదన్
నిరతముఁ గొల్చుచుందుము వినీతులమై యిటు మాకుమారుఁ డీ
కరణిఁ గృతాపరాధుఁ డగుకష్టుని దుష్టునిఁ బెద్ద చేసి మా
గరువ మెఱుంగఁ జాలఁ డిటఁ గారణ మేమి తలంప నయ్యెడిన్. 88

వ. అనిన గడగడ వడంకుచు నుపాధ్యాయుండు వాని కి ట్లనియె. 87

తరళము. తెలియు దేకద దానవేశ్వర దేశికోత్తము లైనమా
వలన నేమియుఁ దప్పు లుండవు వైరిఁ జెప్పము మేము మీ
కలిమిఁ గోరినవార మీపలుగాకి బుద్ధులు వీని కే
కలిగె నైనను దిద్ది తెత్తుము గాక సైఁపుము దీనికిన్. 88

క. అని వాని నోడంబడఁ గా
నొనరిచి ప్రహ్లాదుఁ గొనుచు నొజ్జ యతనితోఁ
జని నిజగేహమునం దిడి
కొని యి ట్లని బుజ్జగించెఁ గొనకొని వానిన్. 89

—♦ గురువులు ప్రహ్లాదునకు బుద్ధిచెప్పుట ♦—

చ. వినుము కుమార! నానుడులు వీనుల కొప్పఁగఁ జెప్పుచుంటి నీ
జనకుఁడు ముజ్జగంబులకుఁ జాలినవాఁడు పరాక్రమంబునన్
మునుకొని పాకశాసనుని ముట్టడివెట్టి జయించినట్టిఁ డా
తనిపెనుదాడి కోడి మును దామరసాక్షుఁడు వాఱెఁ బోరునన్.

ఆ. అతనిపేరు విన్న నజరుద్రవిష్ణ్వింద్రు
లడలు గుడుచుచుందు రతఁడె నేత
యతఁడె త్రాత విష్టపాలికి నీ కట్టి
తండ్రి విడిచి పగతుఁ దడవ నేల. 91

వ. అని యనేకవిధంబు లగునుపాయంబుల బోధించి దిద్ది మఱియు వానితల్లిచేతం దిద్దింప నెంచి లీలావతికడకుఁ గొడుకుం గొనిపోయి చెప్పుటయు నప్పతివ్రత సుతునిం గౌఁగిటం గదియించి చుంచు పుడుకుచు ని ట్లనియె. 92

చ. కడుపునఁ గన్నబిడ్డఁడవు గాని యొకండవు గావు తండ్రి! నీ
కిడుమలు రా భవజ్జనకుఁ డేటికిఁ జెప్పెడిఁ జెప్పినట్లు గా
నడువుము దానవాంతకు మనంబున వీడుము వీడకున్న నీ
పడియెడిపాటుఁ జూచి యొకపాటిగ నే నెటు తాళి యుండెదన్. 93

తే. ఉఱుడు మీఁయన్న యీర్ద్రాద్రియోధవరుల
నున్నయ ట్టుండి కోపించు నన్న ని న్నొ
కడుగఁ జేయును దల్లికిఁ గడుపుశోక
మిడక వేవేగ హరిభక్తి విడువు మన్న. 94

వ. అని చెప్పి కొడుకు నొప్పించితి ననుకొని గురున కప్పగించుటయు నతం డాతనిం గొని గృహంబునకుం చని సహపాఠులలోనం గూర్చి నిత్యకర్మానుష్ఠానంబునకై యెడయుటయు నపు డాదైత్య బాలకుల నెల్లం జేరఁ జీరి ప్రహ్లాదుం డి ట్లనియె. 95

—♦ ప్రహ్లాదుండు సహపాఠకులకు జ్ఞానోపదేశము చేయుట. ♦—

మ. ప్రతిదిష్టంబును వేనవేల్ ప్రజలు చావం జూచుచున్నార మీ
శ్రుతులున్ శాస్త్రములుం బురాణములు వస్తువ్రాతముల్ ప్రాణికిన్
మృతి లేకుండఁగఁ జేయఁ జాలునె జగన్మిథ్యాత్వ మూహించుచున్
మృతియున్ జన్మములేని చోప్పుఁ గొన నీమీఁద న్విచారింపుఁడీ. 96

ఉ. కావు గురూక్తపాఠములు కావుగృహంబులు కావు సంపదల్
కావు ప్రభూతరాజ్యములు కావు జయంబులు కావు శౌర్యముల్
కావు సతీవిలాసములు కావు శుభంబులు దేహధారికిన్
జావును బుట్టువుం దొలఁచి శాశ్వతసౌఖ్య మిడన్ సమర్థముల్. 97

చ. తలఁచిన వోకిలింత లగుదట్టపుఁబెట్టను గొట్టుకొంచుఁ బ్రే
గులు నరముల్ పొరల్ లనదు కుత్తుకకు న్మెయికిన్ గడంకనై
దళముగఁ జుట్టఁ బెట్టుకొని దారి యొకింతయు లేక వేఁగుచున్
వెలలఁ దరంబె పో పొలఁతిపైన్ గడుపన్ చెఱసాలయం దొగిన్. 98

చ. బ్రతికినయన్నినా ళ్ళిటులు బాములకే యగుకాఁపురంబు నా
ఖిత యగుపేరునం బ్రబలి వీఁగక మండెడుకారుచిచ్చులో

సతముగ నేగి వే మిడుతచందమునం బడి వేఁగి వేఁగి యా
మతకరి చచ్చి పుట్టు నది మానెడు దారి యెఱుంగఁ బోలదో. 99

ఆ. బ్రతుకు తరఁగలాట పసిజవ్వనము కొన్ని
నాళ్లమాట సుకము నీళ్లమూట
బోఁటి సొమ్ము కొడుకు మేటిమెఱపుఁ దేట
యేటికయ్య! యిట్టిపాటి బాట. 100

తే. కాఁపుర మనుకడలి నీఁద నోపుదారి
యెట్టిగొదలను దీర్చెడు నట్టిదారి
పుట్టిచావనిసుక మిచ్చు నట్టిదారి
బమ్మ మరయుట యని లోన నమ్ముఁ డోరి. 101

వ. అని సహపాఠకుల కెల్లఁ దత్త్వజ్ఞానోపదేశంబు చేసిన వా రెంత
యు వెఱంగుపడి వానింజూచి నీవు మాయంతవాఁడవు నీ కింత
విజ్ఞానం బెక్కియం గలిగెఁ జెప్పు ననుగ్రహింపు మనినఁ బ్రహ్లా
దుండు వెండియు. 102

సీ. వినుఁడు బాలకులార మును విన్న తెఱఁగు నే
మాతృగర్భమునందు మసలుచుండ
మాతండ్రి తపియింప మందరంబున నున్న
తఱి నింద్రుఁ డలుకనై దాడి వచ్చి
మాతల్లిఁ జెఱఁ గొని ప్రీతి నేగుచునుండ
నారదుం డాతనిదారి నడ్డి
మాయవ్వఁ దనయాశ్రమమునకుఁ గొనిపోయి
పోషించెఁ బుత్రికాబుద్ధిఁ జేసి

తే. వెనుక నమ్మని గర్భమం దొనరునేను
వినఁగ నమ్మహాసాధ్వికి ననుదినంబు
జేసెఁ దత్త్వోపదేశంబు వాసి మీఱ
దాన నిసుమంత నా కిట్లు జ్ఞాన మబ్బె. 103

వ. అని బోధించిన వారును జ్ఞానసంపన్ను లయి సర్వంబునుం దెగడి
నారాయణభక్తిం దగిలియుండి రది యంతయు నాచార్యు లెఱిఁగి

తఱుగని కినుకం గొని హిరణ్యకసిపునికడకుం జని తమకంబున ని
ట్లనిరి. 104

మ. దనుజాధీశ్వర! నీసుతుండు కులతిక్తం బేరికిం గాఁడు చె
ప్పినమాటల్ చెవిఁ బెట్టఁ డన్యమతము న్గ్రీడం డుష్టత్వముం
గొని వర్తించుచుఁ దోడిబాలకులఁ గైకో జేసె దుర్బుద్ధు లా
తనిమూలంబున నెల్లరాక్షసులకుం దబ్బిబ్బు కా నయ్యెడిన్. 105

ఆ. అనిన నులికిపడుచు నమరారి యే మేమి?
చేటు కాల మయ్యె నోటు! కడుపు
చెడఁగఁ బుట్టి కొడుకనుచుఁ గొన్నయరి గాని
కొడుకు గాఁడుఁ నాకుఁ గూళ వాఁడు. 106

మ. అని కల్పానల్పగభీరభైరవసదృక్షుండై రాక్షసేంద్రుండు తక్షణంబ
రాక్షసులం బంచి ప్రహ్లాదు రప్పించి రూక్షేక్షణంబుల నిరీక్షించి
ధిక్కరించి యి ట్లనియె. 107

—♦ హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని శిక్షించుట ♦—

శా. ఏరా! రాక్షసవంశనాశకుఁడ! నీ వే కాక నీతోటిపా
టారక్షస్సుతులుం జెడం గఱపితే యన్యాయమార్గంబునం
జేరం దుర్మతి యెంత చెప్పినను నీచిత్తంబు దుర్వృత్తిమైఁ
బారం బందుట లేదు నీవు బ్రతుకన్ వాంఛింపవా దుర్మతీ. 108

శా. నాయాజ్ఞం గొని కాని గాలి కదలన్ రా దగ్నియు న్మండఁ బో
దీయాకాశమునందు వెల్గఁ డరుణుం డేప్రొద్దు నైవస్వతుం
డాయాప్రాణులఁ జంపఁ జూడఁడు సమస్తాశావకాశంబులన్
బాయం బోక మదీయతేజము దలిర్పం జెల్లు నెల్లప్పుడున్. 109

క. నానుడి మెలఁగవ యేనిన్
సూనుం డని చూడ కింత శూలప్రోతుం
గా నొకరించెద నొంచెద
మానసమున నింక నెఱుఁగుమా నాశక్తిన్. 110

వ. అనినఁ బ్రహ్లాదుండు జడియక తండ్రి కిట్లనియె. 111

చ. చెడి చెఱుపంగ లేదొరులఁ జెప్ప నొకప్పుడు దుష్టబుద్ధులే
ర్పడఁగ జగత్త్రయంబునకు భర్తయు హర్తయుఁ గర్త యైనవి
ష్ణుఁడు మనకున్ శరణ్యుఁడు గనుంగొనువారికి మోక్షమార్గ మా
తఁడు కరుణించు నంటి నిది తప్పనుచుంటివె తండ్రి!చెప్పుమా.112

ఆ. జనుల కెంతకాలమునకైన మృత్యువు
తప్ప దింత నగవ దాని కేను
మానసమున లోకమాన్యుండు హరి యుండఁ
బరులవలనిభయము పడఁగ నేల. 113

వ. అని తెంపరియై పలికిన నలుక వొడమి రాక్షసేశ్వరుఁడు నిర్ద
యుండై రాక్షసవీరుల నిరీక్షించి. 114

ఉ. పుత్రుఁడు గాఁడు వీఁ డెడఁదఁ బుట్టినపుం డని తెల్ల మయ్యె నా
శత్రుని సంస్మరించెడిని సంతతముం గడుఁ బెద్దఁ జేసి నా
పాత్రతఁ జూడఁ బోఁ డెదిరి పక్షుఁడు వీనికతంబున న్మహా
గోత్రము దూలు నిట్టిచెడుగు న్వధియించుట పాడి తండ్రికిన్. 115

క. కావున మీరలు వీనిం
భావమునం గనికరించి ప్రభుసుతుఁ డనుచున్
బోవక పెడత్రోవల వడిఁ
జీవ మెయిం జంపి రండు జీంద్రడం బేగన్. 116

వ. అని యాజ్ఞాపించుటయు శూలహస్తు లగుపరిహస్త్రాది రాక్షసప్రవరు
లాప్రహ్లాదుం బట్టుకొని గిట్టింపం దలంచి. 117

చ. పలువురు రాక్షసాధములు బహుబలంబునఁ బట్టి ముట్టి క
త్తులను గటార్ల శూలముల దొప్పలు దొరలు నెత్తు రూఱ మి
క్కిలి వెత దేర బాలకునిఁ గ్రింద బడం బచరించి నొంచినం
దలకఁ డతండు లోన హరినామము నేమఱ కుండి దండియై. 118

చ. కలగఁడు వెచ్చనూర్చఁడు వికారము నొందఁడు బీతుఁ జెందఁ డె
వ్వలనను గంట నీ ర్విడఁడు వాఱఁడు చేరఁడు తండ్రి చెంత కే

యలమటయుం గొనం డెడఁద హా పరమేశ్వర! హా! రమేశ! హా!
సలలితమూర్తి! హా సుగుణసాగర!యంచు వచించు నెంతయున్.119

వ. ప్రహ్లాదుండు చెక్కుచెదర కున్నఁ గని తండ్రి కనికరంబు లేక కనలి మఱియు. 120

సీ. కాలసర్పములచేఁ గఱపించి కఱపించి
కత్తులచే బిట్టు మొత్తి మొత్తి
మదగజంబులచేత మట్టించి మట్టించి
గండోపలంబులఁ జెండి చెండి
దుర్గాగ్రములనుండి త్రోయించి త్రోయించి
మున్నీటితరఁగల ముంచి ముంచి
వీతిహోత్రునియందు వేయించి వేయించి
విషసముత్కరములు వెట్టి పెట్టి
తే. యిలను బాఁతించి పెనుగాలి కెదురు నిలిపి
గదల మొత్తించి పెనుత్రాటఁ గట్టి కొట్టి
నవబిలంబులు మూయించి నవయ నొంచి
తనయు వేధించెఁ గ్రోధించి దైత్యవిభుడు. 121

వ. మఱియు నిట్లనేకవిధంబుల వేధించియుం గొడుకు వధింప నేరక నిర్విణ్ణుండై హిరణ్యకశిపుండు తనమనంబున. 122

—♦ హిరణ్యకశిపుఁడు కొడుకునకై విచారించుట ♦—

మ. మడియింపం గడు మార్గముల్ వెదకితిన్ మాయించితి వ్రాంచితిన్
జడియం బోవఁడు చావఁ డేవెతయు నెంచం బోఁడు వేసారితిన్
బడుఁ గీతంపు మహాప్రభావనిధి నా భావింపఁగా నయ్యె నేఁ
డిడుమల్ వచ్చెడు వీనిమూలమున రా ని మ్మేమి సేయం దగున్.

వ. అని మిగుల వగలం బొగులుచు ధైర్యంబు దెచ్చుకొని ప్రహ్లాదుం బ్రతీక్షించి యి ట్లనియె. 124

చ. జనకునితోడ వైర మొగి సల్పుచు నల్పుఁ గారణంబునం
దనువు చెడంగఁ గార్యము లొనర్చుట నీతిపథంబు గాదు పు
త్త్రిన కిటు లేల నీ కసురదూషకుఁ డాహరి మాట మాని భూ
జననుత మైననామత మజస్రము నమ్మి భజింపవే సుతా. 125
వ. అనినం దండ్రికిఁ గొడు కిట్లనియె. 126
మ. అమృతాస్వాదన మాచరించుచు మహాహ్లాదంబునం దోఁగును
త్తమచారిత్రుఁడు గంజి ద్రాగుటకుఁ జిత్తంబందు వాంఛించునే
సుమనస్సంఘసమర్చితుం డయిన విష్ణుం భక్తి భావించునే
నమరారీ! యెటు లైనఁ గాని విడి యన్యంబుం గనం బోదునే.
తే. అనిన రోషించి సురవైరి తనయుఁ జూచి
యోరి పలుగాకి! త్రిజగంబు లుల్లమందు
నానుడి యనంగ వెఱగందుఁ గాని నీవు
ధిక్కరింతువు నీ కేరు దిక్కు సెపుమ. 128
వ. అనినఁ బ్రహ్లాదుండును. 129
ఉ. ఎవ్వనిలీల నీజగము లిన్నియు నేర్పడుచుం దలిర్చు నో
యెవ్వఁడు సర్వభూతముల నెప్పుడు ద్రిప్పుచు నొప్పుచుండునో
యెవ్వఁడు సర్వసాక్షి యయి యీక్షణమున్ వెలుగొందుచుండునో
యవ్వరమూర్తి యచ్యుతుఁ డనంతుఁడు శాంతుఁడు నాకుదిక్కగున్.
చ. అనవుడు రాక్షసాధముఁ డహంకృతి మీఱఁగ హుంకరించుచున్
జనయిత రోసి చంపి నను జచ్చెద నంచును మొండికట్టెవై
వనరుదు వోరి నీతలఁచువాఁ డెవఁ డెచ్చట నుండుఁ జూపు మా
తని నిను నంటఁ గట్టి ఘనదావమునన్ బడ వైచి పుచ్చెదన్. 131
వ. అని గర్వించి పలికిన నంతరంగంబున శ్రీహరిం జింతించుచుఁ
బ్రహ్లాదుండు తండ్రి కి ట్లనియె. 132
మ. ఒకచో నుండెడు నుండఁ డొక్కకడ వేఱొండొక్కచో నుండు నిం
కొకచో నుండఁడు నాఁగ నేమిటికి దేవోత్తంసుఁ డావిష్ణుఁ డా
సకలేశుండు చరాచరాత్మకజగజ్జాలంబుల న్నిండి యుం
డి కడుం బొల్చెడు వానినిం దలఁపఁ దండ్రీ! మేలు సేకూరెడిన్.

వ. అని పలుకుచున్న సమయంబున హిరణ్యకశిపుండు రోషకషాయితాక్షుండై కరవాలంబు కేలం గీలించి సింగంపుగద్దియ గ్రిద్దన డిగ్గ నుఱికి. 134

—♦ నరసింహుం డవతరించి హిరణ్యకశిపుని సంహరించుట ♦—

శా. ఎందుం జూచిన నందు నిందిరవిభుం డింపొందు నం చాడి తీ
వెందుం జూపుదువే కులాపశద నే నీక్షింతు నీ వన్న య
ప్పందం జూపక యున్న నీశిరము నాబాహాసి ఖండించి వే
మ్రిందింతుం గనుమంచు వ్రేసె ఘనసంరంభంబునన్ స్తంభమున్.

వ. ఇట్లు వ్రేసిన నాసభాభవనస్తంభంబు ప్రళయకాలవలాహక నిష్ఠుర నిర్ఘాత నిర్ఘోషంబునం బెటిల్లునం బగిలె నందు సహస్రకిరణసహస్రకోటి ప్రభాభాసమానాసమాన దేహధగద్ధగితసకలాశావకాశంబును శ్రీవత్సకౌస్తుభ వైజయంతీప్రముఖ మహాలక్షణ లక్షితవక్షస్థలంబును గరోరఘోరదంష్ట్రాకరాళవివృతవదన గహ్వరంబును దైత్యపశుబంధన బంధురయూపాయితోరుయుగళంబును వజ్రసదృశ ఖరనఖర క్రూరంబును సంవర్తసమయసప్తజిహ్వాజిహ్వాకాసమమహాజిహ్వాంచితంబును సంధ్యారాగసదృశ మహోన్నతసటాచ్ఛటంబును గర్జానినాదనిర్దళితాశావకాశంబును మహారోషభీషణవేషంబును మహోన్నతంబును మంగళాచలబిలాంతర్గతంబు నగు శ్రీమన్నృసింహరూపం బావిర్భవించి విజృంభించె నంత హరిభక్తుం డగు ప్రహ్లాదుండు భయసంభ్రమంబులు పెనంగొనంగ నిర్విణ్ణుం డగుతన తండ్రి కామహానరసింహవిగ్రహంబుఁ జూపుచు. 136

చ. సనకసనందనప్రముఖసంయమిచంద్రులకైన నెమ్మదిం
గనుఁగొన రానివేల్పు మనకట్టెదుట న్నరసింహమూర్తియై
కనుఁగొన నయ్యె ధన్యుల మిఁకన్ గరువం బెడలన్ భజింపు మో
జనక! దయామయుం డితఁడు శత్రువు నైన ననుగ్రహించెడున్.

ఆ. అనుడుఁ గ్రిందు మీఁదు నరయఁ జాలకతండు
వాలుఁ బలుకఁ బూని జ్వలనమందు

మిడుత వోలె నృహరి మీఁద నుంకించిన
నాతఁ డొడిసి పట్టె నతని నట్టె. 138

వ. దితిపట్టి యయుం బట్టు తప్పించుకొని యుప్పరంబున కెగసిన నప్పరమ పురుషుండును వాని ననుసరించి మరలఁ బట్టె. 139

సీ. బాహుపాశంబుల బంధించి బంధించి
యూరుతలంబునం దుండఁజేసి
ఖరనఖరంబుల నురము వ్రయ్యలు సేసి
రక్తప్రవాహంబు వ్యక్తపఱచి
హృదయకోశము వ్రచ్చి యద నెంచి సకలాంత్ర
ములఁ ద్రుంచి గుండెకాయలను దెంచి
కంఠమాలికలుగాఁ గడఁకఁ బ్రేవులు దాల్చి
మెదడుగందము తీసి మేన మెత్తి

తే. పవలు రేయును గాక సంజ వడుతఱిని
మహియు గగనంబు గా కూరుమధ్యమందుఁ
బశువు మనుజుఁడు గానిరూపమున శస్త్ర
మస్త్రమును గానిగోళ్ల నయ్యసురఁ జంపె. 140

వ. ఇట్లు జగద్భీషణవేషంబున లోకకంటకుం డగుహిరణ్యకశిపుని సంహరించిన త్రేతాదినరసింహుని సమక్షంబునకు దర్శనాగతులగుసురగరుడోరగ యక్షరాక్షస కిన్నర కింపురుషాదులయు హర పురందర పరమేష్ఠిప్రభృతులయు సంఘంబుల నొక్కరుండును బోఁ జాలకెడఁ గలిగి నిలిచి వేఱువేఱ వినుతించి రాభార్గవియు డగ్గఱుటకు భయంపడి దూరదూరంబున నుండె నాసమయంబునఁ బితామహప్రేరణంబునఁబరమభాగవతోత్తముం డైన ప్రహ్లాదుండు నిటలతటఘటితకరపుటుండై హరిసన్నిధికిం జని సాష్టాంగనమస్కారంబు గావించి. 141

మ. నిను బ్రహ్మాదు లెఱుంగఁ జాల రనినన్ నే నెంత మూఢాత్ముఁడన్
మునిలోకాహితవంశసంభవుఁడ దుర్బుద్ధిన్ సుపర్వారినం

దనుఁడన్ బాలుఁడ బాలభావుఁడ జగన్నాథా! భవద్భక్తి లోఁ
గొని వర్తించెడువాఁడఁ గాన దయఁ జేకొంచుం గటాక్షింపవే. 142

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై నారసింహుం డాప్రహ్లాదునిఁ గరు
ణాకటాక్షవీక్షణంబులం దనుపుచు నభయహస్తం బొసంగి యి
ట్లనియె. 143

ఉ. భక్తుఁడ వీవు నిన్ గనినవాఁడును భక్తుఁడ కాన వానికిన్
ముక్తి నొసంగితిన్ దనుజపుత్త్రుఁడ నే నని చింతదక్కుమీ
ప్రాక్తనపుణ్యకర్మమున భాగవతోత్తముఁడై జనించి తీ
వుక్తులఁ గేల మత్పదము నొందెద వవ్వలికాలమం దొగిన్. 144

వ. అని చెప్పి శాంతివహించి యెల్లర నామంత్రిణంబుచేయుచుఁ దోతా
ద్రికిం జని సుదర్శనమధ్యగతుం డయ్యెనని చెప్పిననైమిశారణ్యవాసు
లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 145

ఆశ్వాసాంతము.

చ. గళమునఁ బానకమ్ము కడుఁ గమ్మని నెమ్మెయిఁ గ్రమ్మచుండ భ
క్తులకుఁ మోక్షపులం గొనుచుఁ గోరిక లీరిక లెత్త నేలుమం
గళగిరినారసింహుఁ డనుకంపమెయిం గనుగొంచు విన్నపం
బులకులవార్ధిచంద్రులను బోచుచునుండెడుఁ గాక నిచ్చలున్. 146

గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ కవి
సార్వభౌమ ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన
మంగళగిరి మాహాత్మ్యంబునందు
ద్వితీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

—(•)—

శ్రీరస్తు

# మంగళగిరిమాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

—:—

క. శ్రీమద్వినపాములకుల
భూమిసురప్రథితుఁ డగుచు భూరితరయశ
శ్శ్రీమహితుఁ డయినవిద్వ
ద్గ్రామణి లక్ష్మీనృసింహఘనుఁడు తలిర్చున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు ప్రహ్లాదవరదుం డగునరకేసరి నిగమాద్రికిని వరం బొసంగి తొంటియట్లు మంగళాద్రికిం జని చక్రమధ్యగతుండై యుండె నని చెప్పినం బార్వతీదేవి దేవదేవునిం గాంచి దేవా! దివ్యచిత్తంబున నవధరింపు మట్లు మంగళాద్రి పెక్కునామంబులం బొందె ననియు నాటనామంబు ప్రహస్వశృంగి యనియుం జెప్పితి వాయావృత్తాంతంబు లెల్ల విననభిలషించుచుంటి ననినం బరమేశ్వరుండు పార్వతిం గాంచి యిట్లనియె.

### —♦ తోతాద్రి వృత్తాంతము ♦—

తే. వినుము దేవేరి! ప్రహ్లాదజనకు నట్లు
పట్టి చీలిచి నిజభక్తవరదుఁ డగుచు
నందఱు న్వినఁ దోతాద్రి కరుగుదు ననె
నపుడు ప్రహ్లాదుఁ డాహరి నరసి మ్రొక్కె. 3

క. దేవా! నీ కాగిరిపై
నేవంవిధ మైనప్రీతి యేమిటికొ వినం
గా వలతు ననుడు నాతఁడు
తా వినిచె న్వినుము వినుతుఁ దత్తద్విధముల్; 4

సీ. శైలవరేణ్యమై క్రాలు మఱి బొరియా
త్రము నాఁగఁ బర్వతేంద్రము ధరిత్రి
వరదేవతాత్మ యాగిరికి సుశీల నాఁ
బత్నివతంసము పరఁగుచుండు
వారలకు విరూపవంతుఁడుం దేజస్వి
హ్రస్వశృంగుం డనునాత్మజుఁ డగు
వికృతు నాతనిఁ గని వెగటుఁజెందిరి కన్న
వారును జుట్టలై వఱలువారు

ఆ. దాని నెఱిఁగి సుతుఁడు తల్లిదండ్రుల వీడి
దేశదేశములను దిరిగి తిరిగి
కృష్ణవేణి దక్షిణేలాతలంబున
వైష్ణవంబు క్షేత్రవరముఁ జనియె. 5

చ. అటులు విరాగుఁడై యతఁ డహర్నిశము ల్విడకుండ మెట్టుచోఁ
బటుజప మేర్పడంగ నొకపట్టున నారదమౌని కంటికిం
దటుకునఁ గానవచ్చుటయు దండనమస్కృతు లాచరించి య
వ్వటువు స్తుతించె నమ్మునిని వైష్ణవభక్తి ప్రపత్తి యేర్పడన్. 6

తే. ఇట్లు స్తుతియించి దేవ! నీ వెవరొ కాని
దేవదేవుఁడ వని యెంతు దీనుఁడ నగు
నన్నుఁ గరుణింపు మనుటయు నారదుండు
నారదుండను నే నేమి కోరుదు వనె. 7

ఆ. అన నతండు నేను హ్రస్వశృంగి యనంగ
నొప్పువిప్రసుతుఁడ నోమునీంద్ర
యే విరాగి నన్ను నెట్లులు కడతేర్తొ
నీదె భార మనిన నాదరమున. 8

వ. అతం డాతని నక్కునం జేర్చి పేర్చిన ప్రేముడిం జేసి వాని కష్టాక్షరి యగు నారసింహమంత్రిం బుపదేశించి నీవు నిష్ఠాగరిష్ఠుండవై యిమ్మహాక్షేత్రంబున నుండి తపంబు గావింపుము కృతార్థుండ

వయ్యెదవని తిరోధానంబు నొందె నంతనాక్షేత్రంబున నొక్కనో
భూభూతశుద్ధిపూర్వకంబుగా బద్ధపద్మాసనుండై కూరుచుండి. 9

ఆ. ప్రాస్వశృంగి మూడుహాయనంబులు నిష్ఠ
మంత్రజపముఁ జేసి మాధవపద
పంకజములు గొలిచెఁ బరమవైష్ణవుఁ డయి
మెచ్చి రెల్లలోకు లిచ్చ నతని. 10

వ. అంత వైకుంఠపురవాసు లగువైష్ణవు లెల్లరు ప్రాస్వశృంగి తపించు
చోటికిం జనుదెంచి వాని ననేకవిధంబులఁ బ్రస్తుతించి. 11

మ. నరసింహాకృతి దాల్చి విష్ణువు మహానందంబున నీపయిం
బరివర్తించును నీవు ధన్యుఁడవు దేవ ల్లెల్లరుం గొల్వఁగా
హరి నీచెంతకు వచ్చు నీవు త్రిజగద్వ్యాహారపాత్రంబ వై
గరిమం గాంతువు నా నతండు కడువేడ్కం గొల్చె నవ్వేల్పులన్.

వ. అనంతరంబు కొంతకాలంబునకు లక్ష్మీనృసింహుఁ డతనిసమక్షంబు
నం బ్రత్యక్షంబై నీ కేమి కావలయు నెఱింగింపు మనిన నతండు
ప్రాంజలియై ప్రస్తుతించి ప్రస్తుతించి యి ట్లనియె. 13

శా. దేవా! నాపయి నీవజస్రమును బ్రీతిన్నిల్వ నేఁ గోరుదున్
గ్రావంబై చలియింపకుండునటు నన్ గావించి నాశీర్షమం
దీ వుండం దలపోయు మియ్యది వరం బేఁ గోరుదున్ గావునన్
నా విజ్ఞాపన మాలకించి కరుణన్ బాలించి రక్షింపవే. 14

తే. అనిన నట్లనుఁ గావుత మని నృసింహుఁ
డతని నాదరదృష్టిమై నరసి యపుడ
దేవితో వైష్ణవులతోడ దేవ నేగె
నండజేంద్రునిపై నెక్కి యంతలోన. 15

మత్త. పారియాత్రుఁడు పుత్రు రోయుచుఁ బత్తనంబులు పల్లెలున్
ఘోరకాననముల్ మహాగిరికోటులుం గనుఁగొంచు నా
ధారుణీస్థలి కేగినంతన తండ్రిఁ గన్గొని పుత్రుఁడా
దారిఁ గాక పరాఙ్ముఖుం డయి తా నెసంగె గజాకృతిన్. 16

వ. పారియాత్రుండు కుమారుం గానఁ జాలక యట నున్నవిష్ణుభక్తులం బూజించి ప్రార్థించి యి ట్లనియె. 17

ఉ. మీరు మహానుభావులరు మీకు నమస్కృతు లాచరింతు నో
భూరితపోధనుల్ వినుఁడు ముద్దులబిడ్డఁడు హ్రస్వశృంగి నాఁ
బేరుగలాఁ డెటో చనియెఁ బెక్కుప్రదేశము లేగి కంటి లో
నారట మొందుచుంటి సుతుఁ డారయరాఁ డిఁక నేమిసేయుదున్. 18

ఆ. ఎచట నేని గాని వీక్షింతు రే మీరు
వానిజాడఁ దెలిపి నానెగు లిది
పోవు నట్లు చేయ రే వైష్ణవోత్తము
లనిన వాని కిట్టు లనిరి వారు. 19

ఉ. దూరమునందు నిన్నుఁ గని తోఁచినబీతున నేమొకో గజా
కారము గాఁగ ని ట్లగుచుఁ గంజదళాక్షు నుతించుచుండె నీ
చేరువఁ జూడు మల్లదిగొ చేరఁగ వచ్చెడు జానుదోయికిన్
భూరిరవంబు నావుడును బొంగుచుఁ బోలిచి పారియాత్రుఁడున్. 20

వ. వారిం గూడి గజాకారశైలసమీపగతుండై యి ట్లనియె. 21

సీ. ఓకుమారక! నేను నీ కేమి యపచార
మొనరించి నాఁడ ని ట్లుండు టేమి?
నీతల్లి నీకయి నెగులు గుడుచుచుండె
మాకు నీ వొక్కఁడవే కదయ్య
నినుఁ బాసి మే మొక్కనిమిషమాత్రం బైన
మనఁ జాల మోతండ్రి! కనికరించి
గృహమునకున్ రమ్ము గృహిణి. గూర్చుము మాకు
రక్షకుఁడవు గమ్ము రాజ్య మొంది

తే. అని యనేకవిధంబుల నతఁడు వానిఁ
బట్టువడుచును నుండుడుఁ బట్టి యతఁడు
తండ్రికాళ్ళుల కెఱిగి నాతప్పు సైపు
మేను మిము వీడి వచ్చినదానఁ జేసి. 22

ఉ. ఇల్లనుకాలుకొనఁ దమ రేదియొ కోరి మెలంగుచుండఁ దా
రల్లన వచ్చి కోర్కె మొద లార్చెరు దొంగలు పున్నెమన్న సొ
మ్మెల్లను దొంగిలించుకొని యేగినయంతట దిక్కు లేని దై
యుల్లము పల్లటిల్లఁ గొద లొందెడు మానిసిపిండు మెండుగన్. 23

వ. అది యట్టిద కావున. 24

ఆ. సారహీన మైనసంసారమున నేను
వేఁగ లేను తండ్రి! వెట్టి నగుచు
సంసృతిం బొనర్చు స్వాంతంబు సేయను
నన్నుఁ గరుణఁ జూడు మన్న! మదిని. 25

తే. దివ్యులం గూడి నే నొకదివ్యుఁడ నయి
యున్నవాఁడను నీ వేగి కన్నతల్లి
దిగులు పడకుండ నూరార్చి తెలిపి నాదు
నునికి సుఖముండు మను తండ్రి! మన మొసంగి. 26

వ. అని వినయవినమితాంగుండై పలికిన హ్రస్వశృంగి పలుకుల కలరి
కులపర్వతుం డగుపారియాత్రుం డాత్రంబు విడిచి కొడుకునకుం
జెప్పి గృహంబునకుం జనియె నంత విష్ణుభక్తులును హ్రస్వశృంగి
భక్తిభావంబునకు భావంబులం బ్రస్తుతించి రద్దాన హ్రస్వశృంగిపర్వ
తంబు స్తోత్రపర్వతంబు నాఁబడె నని మృడుండు వెండియు. 27

క. ఏనిక పండినవిధమున
నానగ మొప్పాఱుచుండు నాశీర్షముపై
శ్రీనారసింహుఁ డిందిర
తో నెప్పుడు నిలిచి యుండుఁ దోరపుఁబ్రీతిన్. 28

## శ్రీరామచరిత్రము

క. త్రేతాయుగమున విష్ణువు
భూతలమున రాముఁ డగుచుఁ బుట్టెన్ రఘువం
శాతతభూషణ మగుచున్
బూత మ్మగు నచ్చరిత్ర పోలు వినంగన్. 29

మ. సరయూతుంగతరంగిణీతటమునన్ సౌధోపరిస్థాపితో
త్తరవజ్రోపలఘర్షణచ్ఛిత మహోదగ్రప్రభాదిశ్యలై
వరణాభాదివశీకృతక్షణదలై భాసిల్లు సాకేత మన్
పుర మొక్కం డలకోసలక్షితిగళస్ఫూర్జత్సురత్నం బనన్. 30

తే. మోక్షదములలో మున్నెన్నఁ బొసఁగు ప్రోలు
ప్రోలునలె నొప్పువీథులచాలు చాలు
చాలు ననునన్నిపా లిచ్చునాలు నాలు
బిడ్డల నెసంగు గేస్తులదొడ్డ మేలు. 31

వ. ఏతాదృగ్విధమహిమాతివిశాలంబై భూతలంబున విఖ్యాతిం గొన్న సాకేతంబునకధినేతలై ఖద్యోతవంశసంభూతులైన వైవస్వతుండు నిక్ష్వాకుండు నృగువు మరుత్తు నంబరీషుండు కకుత్స్థుండు పృథుండు యువనాశ్వుండు మాంధాత పురుకుత్సుండు ననరణ్యుండు హరిశ్చంద్రుండు సగరుండు నంశుమంతుండు భగీరథుండు నహుషుండు దిలీపుండు రఘువు నజుండు లోనగురాజన్యు లనన్యసాధారణ వైభవంబునం బొడమి వంశకర్తలై చక్రవర్తులై మహానుభావులై యఖండకీర్తికాంతాలలాములై పరమపదంబు నొందిరి వారల యనంతరంబునఁ ద్రేతాయుగాలంకారుం డై. 32

చ. దశహరిదంతరాచల దుదంచయకీర్తిరమాలలాముఁడున్
బశుపతిభక్తికాముఁడు సమస్తనరేశ్వరసుప్రశస్తరు
గ్విశదమణీకిరీట పరివేష్టితదివ్యపదాభిరాముఁడున్
దశరథనాముఁ డొప్పు వసుధన్ విబుధాహితదుర్విరాముఁడై. 33

క. ఆయొడయనికిన్ మువ్వురు
కాయజసమ్మోహనాస్త్రకళ లఖిలసతీ
గేయలు కౌసల్యయుఁ గై
కేయి సుమిత్ర యనఁ గలరు గృహిణులు పొగడన్. 34

ఉ. పాడియుఁ బంటయుం గలిగి బల్ సిరులం దులతూఁగుచుండునా
ఱేఁడు సభార్యుఁడై తగుతఱిన్ గురియన్ నెల మూఁడువాన లే

గోఁడునఁ లేక భూప్రజకుఁ గోరుసుఖంబులు దొప్పదోఁగఁగాఁ
బాడిగ రాజ్య మేలుచును భాసిలుచుండె మహీతలంబునన్. 35

తే. అట్లు సాకేతపురనాథుఁ డైనయాతఁ
డలరు మువ్వుర భార్యల నంది నైన
సుతులఁ బడయంగఁ జాలక సొంపు దరిగి
ఋష్యశృంగుఁడు నాఁబడుఋషినిఁ బిలిచి. 36

వ. తదనువ్రతంబున వసిష్ఠముని యుపద్రష్టగా నశ్వమేధాధ్వరం బొన
రించి పుత్రకామేష్టియం దగ్నిభట్టారకుం డొసంగినపాయసాన్నంబు
భార్యలకుం బంచి యిచ్చె దానంజేసి నాగు గుర్విణులై రంతఁ బది
యవమాసంబున. 37

తే. కాంచెఁ గౌసల్య రాము రాక్షసవిరాముఁ
బడసెఁ గైకేయి గురుభక్తిభరితు భరతుఁ
గనె సుమిత్రయు శౌర్యలక్షణుని లక్ష్మ
ణుని శత్రుఘ్ను శత్రుఘ్ను ఘనుల సుతుల. 38

చ. నలువచతుర్ముఖంబు లన నాలుగుసంద్రములో యనన్ మహో
త్పలనయనాయుధప్రథిత బాహుచతుష్కము నా వసుంధరన్
గళల గభీరతన్ రిపునికారణదక్షపరాక్రమంబునన్
నలువురు నన్నదమ్ములు ఘనంబు పొగడ్తల కెక్కి రున్నతిన్. 39

క. నలువురు కొడుకులు మువ్వురు
మెలఁతలునుం గలసి మెలసి మెలఁగుచునుండన్
బలునైభవ మెసఁగ ధరా
తల మేలుచు దశరథుండు తనరుచు నుండెన్. 40

సీ. అపుడు కౌశికుఁ డధ్వరావనార్థము వేఁడి
క్ష్మాపానుమతి సులక్షణుల రామ
లక్ష్మణులం గొని లలిఁ జను చధ్వమ
ధ్యమున మహావిద్య లన్నియు నొగి
నుపదేశ మొసఁగించెఁ గృప రాముఁ డటఁ జొప్ప
కంఠముఁ జని తాటకను వధించి

మఱి సుబాహునిఁ ద్రుంచి మారీచుఁ దోలి ని
రంతరాయమ్ముగ యజ్ఞ మరసి
తే. సానుజుఁడు రాముఁ డంత సమ్మౌని వెంట
మిథిల కరుదెంచి సీతకై ప్రథిత మైన
యీశుచాపము వేగురు నెత్తరాని
దాని నవలీలఁ గొని సభలోన విఱిచె. 41
వ. అంత. 42
శా. రారాజుల్ వినుతించుచుండ శుభతూర్యంబుల్ సెలంగ న్విదే
హారాధ్యేశుఁడు కాళులం గడిగి కన్యాదానముం జేయఁగా
శ్రీరాముండు పరిగ్రహించి శుభదృష్టిం బెండ్లియాడె న్వరా
కారోపేత మఖోర్విజాత సుగుణౌఘస్ఫీత సీతం దగన్. 43
వ. జనకుం డటకు మున్న నిజసమాహ్వానంబున వచ్చియున్నభరత లక్ష్మణశత్రుఘ్నులకునుం గన్యల నిచ్చి వివాహంబు గావించి సపుత్రకుం డగుదశరథు నంపి పుచ్చుటయును. 44
శా. మధ్యేమార్గమునందు రాముఁ డెదురై మాత్సర్య మొప్పం బరా
సాధ్యం బైనకుఠారధారతఁళుకుల్ సర్వంసహాదిజ్నభో
మధ్యంబుల్ గొలు లేక నిండుకొన భీమప్రక్రియం జూప రా
వధ్యుంగా నొనరించె రాముఁ డహితానస్తంభనోద్దాముఁడై. 45
ఆ. పరశురాము భంగపఱచినరఘురాము
మెచ్చి దశరథుండు గ్రుచ్చి యెత్తి
కౌఁగిలించి విపులకౌతూహలంబునఁ
జేరెఁ బురము సపరివారుఁ డగుచు. 46
సీ. పదపడి సామ్రాజ్యపట్టంబు వక్షీయుఁ
డగురామునకుఁ గట్ట ననని నేత
దలపోయుటయుఁ బాపకలిత యామంథర
బోధమైఁ గైక దుర్బుద్ధి దలఁచి
తనవరద్వయము రామునివనవాసంబు
భరతుఁడు ధర యేలుదొరయుఁ గాఁగ

నడిగిన నోడయుండు నుడుపవశము గామి
వదలుచుండఁగ రాముఁ డది యెఱింగి

తే. తాపసాకృతిఁ దాల్చి సోదరుఁడు సతియుఁ
దోడ రా రాజ్యసౌఖ్యముల్ ద్రోచి వైచి
కారుటడవులఁ దిరుగంగఁ గదలి పోయె
లీలఁ బితృవాక్యపాలనాశీలుఁ డగుచు. 47

వ. అనంతరంబ దశరథుండు పుత్రవియోగదుఃఖంబునం దురపిల్లుచుం గాలధర్మంబు నొందె నంత మాతులనగరంబునుండి భరతుం డరుదెంచి పితృకార్యంబు నిర్వర్తించి చిత్రకూటంబున నున్నయన్న కడకుం బోయి సర్వం బెఱింగించి యి ట్లని విన్నవించె. 48

శా. అన్నా! ని న్నొకనిం గ న న్నొకనిఁ గా న్స్వాంతంబునం దెంచి పా
పౌన్నత్యంబునఁ గేకయాత్మజ యరణ్యావాసముం జేత వై
నిన్నుం బంచినతప్పు సైఁచి మరల న్విచ్చేసి రారాజ వై
నన్నుం దమ్ముని బౌరజానపదుల న్బాలించి రక్షింపవే. 49

వ. అని యనేకవిధంబులం బ్రార్థించినను రామచంద్రుండు పితృవాక్యపాలనాయత్తచిత్తుండై రాజ్యపాలనంబున కొడంబడక ప్రతికాలోత్తరం బిడిన భరతుం డతనిచేతం బ్రత్యాఖ్యాతుండై వానిపాదుకలం గొని నందిగ్రామంబునకుం జని పూజించుచు రాజ్యభారం బంతయుఁ బాదుకలపయి నిడి ప్రజాపాలనంబు గావించుచుండె నిట రామభద్రుండును జిత్రకూటంబునుండి తాపసశరణ్యం బగు దండకారణ్యంబు సొచ్చి యచ్చటిఋషులరక్షోభయంబు పుచ్చి శరభంగు నాశ్రమంబుఁ జేరి యమ్మునిఁ సర్చించి గోదావరీతీరంబున సజాయానుజంబుగ నివసించియున్నసమయంబున నటకు దశగ్రీవుచెలియలు శూర్పణఖ యనునది చనుదెంచి రాముం గాంచి కామించి యున్నంత నతనియనుమతంబున లక్ష్మణుండు తత్కర్ణనాసికాకర్తనంబున వికృతం గావించె నంతం దన్నిమిత్తంబున నాగతు లగు ఖరదూషణాదులం దొట్టిపదునాలుగువేవుర రక్కసుల రాముం డుక్కడంచి దండకారణ్యంబు విగతకంటకంబు గావించె నవ్వలఁ

జుప్పనాతియు నన్నపాలి౦జని సీతారామసువృత్తాంతంబును దనపరా
భవంబు నెఱింగించి దుఃఖించుచు ని ట్లనియెను. 50

చ. కలన సమస్తదేవతలఁ గన్నెత్తదలించెనునంతలోపలన్
గెలిచిన యట్టిబల్లిదులు కేవలులే మిముబంటివారికిన్
జెలియలి నైననా కిటులు చిన్నమనుష్యునిచేఁ బరాభవం
బొలయ నుపేక్షచేసి యిటు లుంచుట ధర్మమె వీరకర్మమే. 51

వ. అనిన విని రావణుం డత్యంతరోషావేశంబున మారీచుం బైడిలేడిం
జేసి దండకారణ్యంబున కనుచుటయును. 52

చ. రతనము లెల్లెడ న్నిలిపి రాజిలఁ జేసినపైడిబొమ్మ నా
నతికుతుకంబుఁ గూర్చుచు విహార మొనర్చెడుమాయలేడి నం
చితగతిఁ గాంచి చెంగటన సీత మహీతలనేత కమ్మహా
ద్భుతమును జూపి యి ట్లనియెఁ దోరపువేడుక లోడి గిల్లఁగన్. 53

తే. కనకమృగ మిద్ది యిట్టిది కలుగు ననుచుఁ
గనియు వినియు నెఱుంగ లోకమున నెందుఁ
బ్రాణవల్లభ! దీనినిఁ బట్టి తేర
మనసు పుట్టెను గాన నామనవి కొనుము. 54

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై రామచంద్రుండు చంద్రవదనప్రి
యంబుఁ దీర్ప సమకట్టి దేవీరక్షణార్థ మట సౌమిత్రి నునిచి తాను
ధనుర్బాణతూణీరఖడ్గాది సాధనంబులు సంగ్రహించి మించినవేడ్క
రుద్రుండు యజ్ఞమృగంబునుం బోలె సమ్మాయామృగంబు వెంట
నంటి తరుముచుం జనియె నదియును. 55

మ. బెదరుం బెన్వడిఁ బాఱుఁ జేరుఁ గడలన్ బిట్టాడు మట్టాడుఁ బెం
బొదలం డాయుఁ దృణంబు మేయు దివికై బోల్చున్ భువి న్నిల్చులో
నొదుగుం బై కెదుగున్ మనోహరముగా నూగాడుఁ దోగాడు నూ
ర్చుఁ దగం బేర్చుఁ గనున్ నినున్మదము వెంచున్నించువిద్వేషమున్.

వ. ఇట్లమ్మాయామృగంబు కొండొకవడి వ్యవహితంబును సన్నిహి
తంబును దిరోహితంబును దృశ్యంబు నదృశ్యంబునై యవ్వనాంత

రంబునం బరిభ్రమింప రామభద్రుండు దానివెంట నంటి పెద్దదవ్వు
చని కొంతవడి కది మృగంబు గా దనియు మాయామృగం బనియు
నిశ్చయించి యొక్కవాలంబుం దిగిచి మాయామృగంబుపై నేయు
టయు నద్ది హా లక్ష్మణా! యనియు హా సీతా యనియు నుచ్చస్స్వరం
బునఁ బుడమిం బడి విలవిలఁ దన్నుకొనుచుం జచ్చె నయ్యెలుంగు విని
సీత భీతచిత్తయై తత్తఱంపడి లక్ష్మణుం దిలకించి. 57

శా. అన్నా! లక్ష్మణ! లక్ష్మణా యనుచు నార్తారావ మేతెంచె మీ
యన్నన్ రాక్షసుఁ డాజిలోనఁ బడవేయన్ జాలిమై పోలుచున్
నిన్నున్ సంస్మరణంబు చేసినయటుల్ నే నెంతు నోతండ్రి! నా
కన్నుల్ నీళుల నిండె గుండెలును మేన్ గంపించెడిం గావునన్. 58

వ. నీవు పోయి మీయన్నను నన్నుఁ గాచి రక్షింపు మనిన నతండును.

క. అమ్మా! యుమ్మలికము విడు
మమ్మా! యమ్మాన్యు గెలువ నరిఁది తలఁకుఁ బో
ముమ్మొనవాల్దాల్పైనన్
ముమ్మాటికి నమ్ము మమ్మ ముద్దవు సుమ్మా. 60

సీ. అని వలదన్న విననిసీతనిర్బంధ
మున లక్ష్మణుం డన్నఁ గనఁగ నేగ
నాలోన రావణుం డరుదెంచి మాయమైఁ
గొనిపోయె సీత దక్కినపుడారి
మొఱవెట్టినామెకై మొనసి జటాయువు
కడుఁ బోరి చచ్చె రాక్షసునిచేత
మరలినరామలక్ష్మణులు సీతను గాన
కడవిలో నరయుచు నరుగుదెంచి

తే. స్వీయకార్యహేతుఁ డగుజటాయువునకు
నుత్తరక్రియ లొనరించి హత్తుకొనుక
బంధుఁ బరిమార్చి శోకంబు పరిఢవిల్లఁ
గదలి పోవుచు ఋశ్యమూకంబుఁ జేరె. 61

వ. అట సుగ్రీవునితోఁ సఖ్యంబు వాటించి వాలి నొక్కవాలంబునం
గూల నేసి యనుపట్టికం బట్టంబు గట్టి హనుమంతునివలన సీతా
వృత్తాంతం బరసి కపిసేనాసహితుండై సేతుమార్గంబున దక్షిణ
సముద్రంబు దాఁటి రావణాదిరక్షోగణంబుల రణంబున మరణంబు
నొందించి విభీషణునిం బరిచరుఁ గాఁ గొని హనుమత్సీతా లక్ష్మణ
సుగ్రీవాంగదజాంబవదాదులతోఁ బుష్పకాధిరూఢుండై కదలి సాకే
తంబున కరుగుదెంచి పట్టాభిషిక్తుండై కుశలవు లనునిరువురు కొడు
కులం గని కలకాలంబు సర్వజనసమ్మతంబుగాఁ బూజ్యసామ్రాజ్యం
బేలి సజాయానుజంబుగాఁ బునరావృత్తిరహితంబును సూర్య
చంద్రాగ్నివిరహితంబు నగు నిజపదంబునకు నిర్గమించె నంత
నయోధ్యా పురంబునం గలచరాచరంబులగుసర్వప్రాణులును
రామాజ్ఞం గొని వైకుంఠంబునకుం బోవువారై పురద్వారంబుకడకుం
జేరి యున్నంత ద్వారపాలకు లగుకుముదాదులు వారిం గాంచి
యిట్లనిరి. 62

సీ. మీరు ధన్యాత్ములు మీకుఁ బరమపదం
బొసఁగఁ గాదని ముక్తి నొంద నెంచి
రది గానఁ జెప్పెద మవధరింపుఁడు మీర
లవనిపైఁ గల్గుతోత్రాద్రి కరిగి
నృహరి సేవించిననే కాని ముక్తి ల
భింపదు వినుఁడు తత్పృథ్వీధరము
దర్శనమాత్రన తనరు సారూప్యము
దాన నానందపదంబు గలుగు

తే. అనిన వారలు వారల నరసి మేము
రామచంద్రునితో వచ్చినాము మరల
భూమి కేగుఁ డటంచ్రడిది పోలు నొక్క
కరుణఁ జూడుఁడు మ మ్మనఁ గనికరించి. 63

వ. భక్తాగ్రగణ్యులారా! మీరు కామచారులై గిరిదర్శనంబు చేసి రండు
మీకు సర్వార్థసిద్ధి యగు నయ్యద్రిరాజము వింధ్యావాగ్భాగంబునఁ

గృత్స్నవేణీతీరంబునం గలదు నిత్యయుక్తుం డగుప్రహస్వశృంగి నిజదర్శన మాత్రన సర్వులం బవిత్రులం జేయు నందు శ్రీహరి నృసింహుండై యుండు బ్రహ్మాదు లాతని నిచ్చలుం గొలుచుచుందురు మీ రట కేగినంతన మీకు సారూప్యంబు సిద్ధించు ననిన భక్తులు కామ రూపులై తోత్రాదికిం జని నృహరి దర్శించి స్తుతించి నమస్కరించి నంత దేవదేవుండు వారికి దర్శన మిచ్చి యి ట్లనియె. 64

శా. ఏ నారాయణుఁడనై జనించితిని మీ రెల్ల న్మదీయుల్ మిముం
నే నెప్డుం గరుణించుచుండెదను నిర్నిద్రానుకంపామతిం
మౌనివ్రాతసమర్చితం బగుచు నీమాన్యాద్రి భక్తౌఘముం
సానందంబుగఁ జూచి ప్రోచు ననుచుం స్వాంతంబులం దెంచుఁడీ.

వ. అని వాక్రుచ్చి తిరోహితుండయ్యె వారును నారసింహారాధనంబు చేసి ముక్తులై రందున నదిముక్తిక్షేత్రంబై ముక్తిపర్వతంబు నాఁ బడె నింక ముక్త్యాదిస్థమైన తెఱంగు చెప్పెద నని మఱియు. 66

## —♦ ముక్తితీర్థము ♦—

సీ. మును మాండకర్ణియుం భోగపరుం డొక్క
ద్విజుఁడు ఘోరతపంబు వెలయఁ జేసె
వానితపంబున వాసవుండు దలంకి
రంభముఖ్యుల నప్సరసలఁ బంచె
వారు మానీంద్రునిచేరువ విహరింప
నతఁ డందు రతిపుత్రి యనెడుదానిఁ
గని కామతప్తుఁడై కౌఁగిటం గదియించి
దానితోఁ గ్రీడించెఁ దపము విడిచి

తే. మూ డహోరాత్రము లొకరపూట గాఁగఁ
గడపు నంతట నచ్చరల్ కన్నెఱంగి
మునిని వంచించి పోయిరి మునియు నెల్ల
కడలు రోసియు నెంతయు నడలు గుడిచి. 67

వ. నదులు వనంబులు గిరులు గుహలు లోనగు నెల్లచోటులు రోసి రోసి యెందును గానఁ జాలక విసివి వేసారి విరక్తుండై పొగులుచుఁ బశ్చాత్తాపతప్తుండై యున్నయవసరంబున నారదుండు దర్శనంబిచ్చి వానికిఁ దత్త్వోపదేశంబు చేసి నీవు తోతాద్రికిం జని ముక్తితీర్థంబున స్నానంబు చేసి ముక్తుండవై చక్రమధ్యగతుం డగు లక్ష్మీనారసింహు నారాధింపుము కృతార్థుండ వయ్యెద వనిన నతండు గంగాతీరంబునుండి తోతాద్రిక్షేత్రంబునకు వచ్చి ముక్తితీర్థంబున నాడి నారసింహు నారాధించి ముక్తుం డయ్యె మఱియును. 68

—♦ ముక్తాక్షేత్రవృత్తాంతము ♦—

ఆ. పొదలు మంగళాద్రిపురమునందు సుశర్మ
యనెడుభూసురాన్వయాభరణము
విష్ణుభక్తుఁ డతనివెలఁది సుశీలనాఁ
బేరఁ బరఁగుచుండుఁ బేర్మి మీఱ. 69

వ. జగన్నుతు లగునాదంపతులకు నారాయణ సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధు లనునేవురు కుమారులు పుట్టి రందుఁ బంచమ కుమారుండు. 70

మ. వేదశాస్త్రము లన్నవారల వెక్కిరించుచు కాదు త
ద్వేదపాఠకు లన్నఁ జీ యని తిట్టి కొట్టి బహిష్కృతిం
గాదు నాఁక పొనర్చుచుండును గాశ్యపీసురుఁ డన్ననో
వాదు లాడి తృణంబుగాఁ గని పట్టి త్రోయు మహోగ్రుఁడై. 71

సీ. కూటసాక్ష్యము లిచ్చుఁ గులసతులను బుచ్చు
గుజనులఁ గని మెచ్చుఁ గులము వ్రచ్చు
టాటోటులను బల్కు మాటల సుధఁ జిల్కు
బూటకంబునఁ గుల్కుఁ బున్నె మల్కు
బాటసారులఁ గొట్టుఁ బోటులఁ జెఱఁబట్టు
మేటులఁ గొదఁగట్టు మిగులఁ దిట్టు
మధుమాంసములు మెక్కు మర్యాదలకు దక్కుఁ
భోరాటముల్ కెక్కుఁ బోరిగనిక్కుఁ

తే. బోఁతరించుఁ బరార్థముల్ ప్రముచ్చిలించు
జూదముల నాడుఁ గులటల సురత మాడు
సత్క్రియల రోయు దుష్క్రియల్ సలుప డాయు
దుర్జనవ్యూహ మగ్గింప దుర్జనుండు. 72

వ. ఇట్లు దుష్ప్రచారప్రవర్తకుండై దుష్టుండైనయయ్యనిరుద్ధునిఁ దల్లి దండ్రులు నన్నదమ్ములు బంధుమిత్రులు లోనగువా రెన్నియో నీతులు రీతులుం జెప్పి చెప్పి విసివి వేసారి రతంబును నిజకులాచారంబు లన్నియు నుజ్జగించి నీచకులంబులవారితోడం గూడి నీచుండై ప్రవర్తించుచుండె ని ట్లుండ నొక్కనాఁడు. 73

సీ. సంపఁగిఁ దలరాసి చక్కనౌ నెఱికలు
కరమరుదందఁ గీల్గంటు వైచి
పున్నమచందురు పోల్కినున్నట్టునె
మ్మోమునఁ గస్తూరిబొట్టు వెట్టి
కన్నాకురతనంపుఁబొన్నుసొమ్ములు వెట్టి
రాణించి పైఠాణిరైకఁ దొడిగి
బంగారునీరారు పసిఁడీరుజలతారు
చెఱఁగుల నొప్పారుచీర గట్టి

తే. అందె లంతంత గల్లుగ ల్లనుచు మ్రోయఁ
జెలఁగి కుచ్చెళ్ళు మీఁగాళ్ళఁ జిందులాడఁ
గౌను నసియాడఁ జెలులచే యూని రాచ
బాట నడయాడె బోగముబోఁటి యోర్తు. 74

వ. అయ్యవసరంబున. 75

శా. తీవ్రం బోయెడు సుందరాంగుఁ డనిరుద్ధుం డామె వీక్షించి యా
దేవస్త్రీలను ధిక్కరింప నగుచున్ దేదీప్యమానప్రభన్
భావింపం దగునీసరోజముఖి యేభాగ్యప్రభారాశికిన్
దేవీత్వంబును బొందియున్నదియొ వారిన్ ధన్యుఁగా నెన్నెదన్. 76

మ. సుదతీరత్నము దీనిమేను సుమ మంచుం జెప్పఁగా నొప్ప దీ
మృదులత్వం బట నెట్లుచూచిన నొ కింతేనిం గనన్వచ్చునే

మొదలం జొచ్చిన లేతగాలి వసఁ గంపించుం గపుం గంపించుఁగా
మదనాస్త్రం బిది నామనోదిశఁ బగిలింపం జాలియుండెం గదా. 77

ఆ. రాచకన్నె యనుచుఁ దోఁచునీతరలాక్షి
యంగసౌష్ఠవంబు నరయ నరయ
గుండె గొట్టుకొనుచు నుండె మారుని బోతి
కగ్గ మైతి దీని నంటకున్న. 78

ఆ. నాదుప్రాణ మిపుడె నడచెడు నెటు లైనఁ
గవయుమార్గ మేను గందు ననుచు
దారివెంట నడిచెఁ దాను నట్టుల వెఱ్ఱి
చూపుతోడ దానిఁ జూచుకొనుచు. 79

వ. అదియు నంతలో నరహరిదేవళంబుదారి వట్టి నడచుచుండం జొచ్చె ననిరుద్ధుండును దానివెంటం బడి పోవుచు నొక్కచో నొక్కప్రాజరిం గని ముందు చనుసుందరాంగిం జూపి యిది యెవ్వతె యని యడుగుచుం దనమనోవికారం బంతయు నెఱింగించిన నతం డతని తండ్రిసద్వర్తనంబును వానిదుర్వర్తనంబు నెఱింగినవాఁడు గావున వాని నెటులేని వంచించి మంచివర్తని మెలంగం జేయనెంచి వానిం గాంచి యి ట్లనియె. 80

మ. అనిరుద్ధా! యిది ముక్తనాఁ బడెడు కన్యారత్న మీనారసిం
హునకుం దాసిగ నుండెఁ బ్రత్యహము నీరౌరాజ్య ... లయాం
బునకుం సేవ యొనర్ప వచ్చెడిని రేపు న్మాపు ...
బున జన్మించినయేని సాధ్వి యని చెప్పం దీని నూరంతయుం. 81

క. ఇది నీకుఁ దగును నీకో
మదనాహవమందు నీమె మాఱొడ్డి నినుం
సదమదము సేయఁ గలయది
కద! నీకుం గూర్తు దానిఁ గడునిపుణతన్. 82

వ. అని యతం డామెం దరియ నరిగి దానితో వానివృత్తాంతం బంత యుం జెప్పి నీ వెట్లయిన వీని మంచిదారిం బెట్టి సుశర్మకులంబు ధ

రించినపుణ్యాంబునం బో మ్మని యక్కొమ్మ నొప్పించి సమీపించు
ననిరుద్ధుం బిలిచి నీ వీమె చెప్పినచొప్పున మెలంగితివేని నిన్నీమె
చరితార్థుం జేయు నని చెప్పి యెందేనియుం జనియె నంత ముక్త
యనిరుద్ధునిదిక్కు మొగం బై. 83

సీ. నే వేశ్యకులమున నావిర్భవించిన
దాన నైనం గులంబుదారి ననక
భక్తివైరాగ్యముల్ వడసినదాన నై
విటులసంగతికి నిప్పటికిం జనక
దేవదాసిగ నుండి దేవుని సేవించు
కడిమి నైం గాలంబు గడుపుచుంటి
బ్రహ్మవంశమునందుం బ్రభవించితివి నీవు
నీతాలెం గట్టికో నేం దలంతు

తే. కాని నీదుష్టచేష్టలు కడకుం ద్రోచి
కానికూడులు గుడువక మానివృత్తి
నూని దేవార్చనాదుల నుంటివేని
నిన్ను వరియింతు నామాట నిజము వినుము. 84

తే. నీవు నాతోడం జనుదెమ్ము నేను నీకు
సర్వసదుపాయములు గల్గుసరణి గూర్తు
సంశయింపకు మెద సదాచారపరుండ
వగుము పిమ్మట నాతోడితగుల మగును. 85

వ. అనిన వాం డామె చెప్పినచొప్పున కొప్పుదలం జెప్పి యప్పుడంతి
తోడం గూడి తద్గృహంబునకుం జని మధుపానద్యూతమాంసదురోద
రాదిదుర్వ్యసనంబు లన్నియుం బరిత్యజించి ఘాతుకులతోడి మైత్రిం
దెంచివైచి భూతదయాళుండై పంచగవ్యంబు సేవించి పూతుండై
సదాచారతత్పరుండై వ్రతపరాయణుండై యుండె నప్పుడు. 86

సీ. ముక్తతోడ నేనుం బ్రొద్దున మేల్కాంచి
కాల్యకృత్యంబులు కడంకం దీర్చి

దేవతాప్రార్థనాదికమెల్లఁ గావించి
పూఁదోటకుం బోయి పూలు దెచ్చి
పూదండలం గట్టి పూఁబోఁడితో దేవ
ళమ్మున కేగి స్థలమ్ము శుద్ధి
గావించి నరసింహదేవుని దర్శించి
పూలమాలికలతోఁ బూజ చేసి

తే. దేవతాప్రసాదము గొని దేవదాసి
తో గృహమ్మున కేతెంచి దొడ్డవ్రతము
పట్టి ముక్త్యంగనాప్రీతిపాత్ర మగుచుఁ
బూతుఁడై పోయె ననిరుద్ధభూసురుండు. 87

వ. ఇట్లు ముక్త్యనుగ్రహపాత్రుండై యతండు తల్లిదండ్రులయింటికిం బోవుచు వచ్చుచుండు వాఁడై సాధువృత్తిం బ్రవర్తించుచున్నయప్పు డొకనాఁడు వైశాఖశుక్లచతుర్దశీదినంబున నృసింహజయంతి వచ్చిన నచ్చిగురాకుఁబోఁడి నిజప్రియుం డగు ననిరుద్ధుం బిలిచి యి ట్లనియె. 88

తే. అనఘ రేపు నృసింహజయంతి దినము
వ్రతము గావింతు నే నుపవాస ముండి
నీవు రేపును మరునాఁడు రా వల దిట
నాకు నోముంట నిన్నంట నరక మగును. 89

సీ. అనుడు నాతం డను నతివ నీ విట్లు నుప
వాసముండిన నేను బంచభక్ష్య
పరమాన్నములు మెక్కువాఁడనే? నీతోడ
నుపవసింతు వ్రతంబు నొగి నొనర్తు
ననవుడు నది యట్టు లైన మే లని వ్రత
మండపంబున స్వామి నుండఁ జేసి
యావాహనాసనాద్యఖిలోపచారము
లనిరుదుతోఁ గూడి యాచరించి

తే. పవ లుపవసించి జాగర మవల సలిపి
నారసింహుని ధ్యానించి ధారుణీసు
పర్వులకు భూరిదక్షిణల్ పరఁగ నిచ్చి
భక్తిభరితులై వారలు ముక్తులైరి. 90

వ. ముక్తాంగనాకారణంబున నిది ముక్త్యాక్షేత్రం బయ్యెఁ బఱి మఱియును,

—♦ ముక్తిగిరి - ధర్మాద్రి ♦—

సీ. మునుపటిద్వాపరమున జను లందఱు
ధర్మమునందఁ తత్పరతఁ దగిలి
కామ్యముల్ వ్రతములు క్రతువులు కామించి
కావించి స్వర్గతి గలిగి పిదప
క్షీణపుణ్యులు గాఁగ క్షితిఁ బుట్టి చచ్చుచు
నొకనాఁడు దేవేంద్రునొద్ద కేగి
చచ్చుచుం బుట్టుచు సతతంబు మే మిట్లు
కుతిలఁ గుడుచుచుంటి మతులితగతి

తే. ఇట్లు మాకేలఁ గలుగునో యేమిచేసి
పుట్టుచావులు లేకుండఁ బొదలఁ గలము
చెప్పవే యన నిందుఁడుం జెప్పె నిట్లు
ధర్మతత్పరు లగువారి దయను గాంచి. 92

మ. శ్రుతిపాత్రప్రవిమోహితాత్ము లగుచున్ స్తోమంబులన్ జేయుచున్
వ్రతముల్ కామ్యము లాచరించుచు సుధర్మశ్రద్ధ హీనుండియున్
క్షితి మే న్వాసి దినంబునందు ఫలముల్ చేకొంచుఁ దల్ క్షీణసం
గతి భూమిం బడి తొంటియట్లగుచు స్వర్గంబందుచుం ద్రెప్పుదుర్.

తే. ఏమె కర్తల మనుచు లో నెన్న కొనక
యీయాత్మ ప్రాణబుద్ధిని నెట్టివేళ
ధర్మకర్మంబు లొనరించి సద్గోహాతి
గల్గి వర్తించి ముక్తులై వెలయఁ గలరు. 94

ఉ. చెప్పెద గాలకీలి[illegible] శ్రీనరసింహనివాసమాన్యమై
యెప్పుడు ధర్మ[illegible] క్షేత్రవరంబు[illegible]
చెప్పఁగ [illegible] చెప్పరాదెపు డీరితి [illegible] యం
దాప్తనృసింహునిం గొలువ నొందుదు ర[illegible] సద్గతిన్. 95

వ. అనిన ధర్మజ్ఞు లగువా రెల్లరు నిమిషసిద్ధాన్యంబులు శిరసావహించి శ్రోత్రాదినిం జని నారసింహు నాశ్రయించి ముక్తిం గాంచిరది మొదలు లది [illegible]ఖ్యాతం బయ్యె నని యమ్మహీధరుండు వెండియు. 96

## —♦ మంగళాద్రి ప్రకారము ♦—

ఆ. అగజ! మంగళాద్రి యనుపేరు వచ్చుట
కనువడినవిధంబు నంతయు విన
నవధరింపు మేను సవిశేషముగ నిప్డు
చెప్పనుంటి ననుచుఁ జెప్పె నిట్లు. 97

సీ. మునుపటికలియుగంబునఁ బాపు లగునరుల్
పదునాల్గువే లయి ప్రస్తుతింపఁ
బహునరకంబులం బడి దుఃఖ మొందుచు
యమునింటో నొక్కనాఁ డనిరి యిట్లు
నారాయణుఁడు నిజనాభికమలమందు
బ్రహ్మను బుట్టించి బ్రహ్మ మీఱ
వేదములం జేసి వేధ కిచ్చి సృజింపు
మఖిలలోకము లని యాన తిచ్చె

తే. బ్రహ్మ సృష్టికిఁ బూనినపట్ల విష్ణు
మాయ సోమకుఁ డుదయించి మహిమ మీఱ
నలువకడ నున్న వేదముల్ నాల్గు దొంగి
లించి సాగరమున డాగె నెంచ కజుని. 98

వ. అంత విరించి విష్ణుండై చేయునది లేక చింతించుచుండ విష్ణుండు
మత్స్యరూపంబై జలంబులం జొచ్చి వేదచోరుని సంహరించి వేదంబులం

దెచ్చి చతుర్ముఖున కిచ్చె నంత నతండు సత్వరజస్తమోగుణాభిభూ
తుండై ప్రజల సృజించుచు వారి నాచారపరిభ్రష్టు లగువారిం
గావించె వారును. 99

సీ. కామ మనుసరించి కర్మము లొనరించు
వారు స్వర్గాపేక్షఁ బడెడువారు
పరనింద చేయుచుఁ బరులఁ బీడించెడు
వా రధర్మములపా ల్పడినవారు
తేజోవిహీనులు స్త్రీజనాసక్తులు
ప్రాణిహింసాపరుల్ పాపరతులు
సన్మార్గదూరులు సాధుసజ్జనహింస
కులు పరవిత్తముల్ గొనెడువారు

తే. నిజము పలుకనివారు ననీతిపరులు
శఠులు కొండెములను జెప్ప సాహసించు
వారు వర్ణసంకరకరుల్ భక్తిహీను
లైనవా రెందఱో పుట్టి నైరి ధాత్రి. 100

వ. వారు నిరయంబులంబడి పొక్కుచు నొక్కనాఁడు పితృపతిం గని
సమవర్తీ! మే మే జాతికిం జెందినవారమై పరిపరివిధంబులఁ బరిత
పించుచుంటిమి మా కెప్పటికేని నిరయనివాసంబు లుడుగునో దోష
దూషితుల మైనమా కెట్టిగతి యైనఁ బట్టునో యెఱింగింపు మనినఁ
బరేతరాట్టు పరమేశ్వరధ్యానంబు గావించి వారిపైఁ గరుణఁ
జూపుచు ని ట్లనియె. 101

ఆ. జీవులార! వినుఁడు క్షితి నున్నయప్పుడు
నింద్య మైనయవియు నేఁడు నరక
భాజనమ్ము లైనబహువిధకర్మముల్
దుఃఖదంబు లగుచుఁ దోఁప వచ్చు. 102

సీ. తల్లిదండ్రుల గురూత్తములఁ బోషింపని
వారు సంసారసేవాప్రసక్తు

లార్యజనధనాపహర్తలు వేదాంత
తత్వ మెఱుంగనిదంభమతులు
పుణ్యతీర్థంబుల మునుఁగనివారు నే
కాదసుల భుజించుకాంక్షవారు
నన్నాతురుఁ నోటియన్నము పడఁగొట్టు
వారు పాపాత్ములై వఱలువారు

తే. వారిపాపముల్ పరిహరింపంగ నెందు
వెదకి చూడఁ బ్రాయశ్చిత్తవిధులు లేవు
సులభ మగునుపాయం బొండు తెలియఁబఱతు
సావధానులరై వినుం డావిధంబు. 103

వ. అయోధ్యాదిమహాక్షేత్రంబులును గంగాదిమహా[illegible] వేంకటా
చలాదిపర్వతంబులును దండకారణ్యనైమి[illegible]
మఱియు ననేకక్షేత్రతీర్థంబు లుర్వీతలంబునఁ బొలుపొందు నందు
నందు మీరు ప్రవర్తించిన మీ కుత్తమగతులు సిద్ధించు నని
పుఱియును. 104

## —♦ ఉండవల్లికొండ ♦—

తే. మంగళాద్రికి వాయవ్యమహీతలమునఁ
గృష్ణవేణీతటంబునఁ గీర్తిత మయి
పద్మనాభ మనంత మర్ఘ్యప్రతిభ గాంచి
క్షేత్రరాజము వెలుఁగొందు శ్రీకర మయి. 105

శా. విశ్వామిత్రుఁడు గాధిపుత్రుఁడు జగద్విఖ్యాత తేజోమహా
త్త్వైశ్వర్యుం డయి పద్మనాభమున దివ్యప్రాభవం బేర్పడన్
విశ్వం బెల్ల నిజప్రభావమునకున్ విభ్రాంత మౌనట్లుగన్
శశ్వద్దీప్తిఁ దపం బొనర్చెఁ దొలుతన్ బ్రహ్మత్వముం [illegible].

తే. ఇట్లు పెక్కేండ్లు కౌశికుఁ డిన్నినీళ్లు
లైనఁ దావ్రక తపమున్న యవసరమునఁ

బద్మనాభుఁ డనంతుఁ డాభక్తవరుని
యెదుట సాక్షాత్కరించె సమ్మదము పొదల. 107

సీ. అట్లు కౌశికు చెంత సాక్షాత్కరించిన
పద్మనాభస్వామి ప్రీతినిఁ గాంచి
వరము వేఁడుము మునివర! వరదుఁడ నైతి
నావుడు నాతఁ డనంతమూర్తి
పాదాబ్జములమీఁద వ్రాలి సాగిలి మ్రొక్కి
దేవ! నీ విట్లు నాదెసఁ బ్రసన్నుఁ
డైతి వింతియ చాలు నైన వరం బిత్తు
నంటి కావున నాదునంతరంగ

తే. మెపుడు నీపదాబ్జంబుల నెడయ కుండు
న ట్లనుగ్రహింపుము నా ననంతమూర్తి
యీవు కోరినయ ట్లగు నింక మీఁద
నీవు బ్రహ్మర్షివై ఖ్యాతి నెగడఁ గలవు. 108

చ. మఱియొకమాట చెప్పెదను మౌనివరేణ్య! యొకానొకప్డు మం
దరగిరినుండి జారి యిటు ధాత్రిపయిం బడె గండశైల మే
నరసి యిటం బ్రియంబున సమస్తమునీంద్రులు సన్నుతింపఁ గా
నిరతము నొప్పుచుండెద ము నిప్రవరుల్ గుహాలందు నుండ్రిటన్.

సీ. విశ్వకర్మసుతుండు విబుధశిల్పి గిరీంద్ర
మందు దివ్యమణీసమంచితముగ
మండప మొండు నిర్మాణంబు గావించె
నం దనంతునిభోగమందు నేను
విబుధులు సేవింప వేణీతరంగళీ
కరపరంపరలతోఁ గలియ నైన
మందమారుతమును బొందు చానందింతు
నింద్రాదిపూజల నెపుడుఁ గొనుచు

తే. నేను వర్తింతు నిచ్చట నీవు నుండి
నన్ను సేవించుచుం దపోనల్పశక్తి

యుక్తుఁ డవు బ్రహ్మఋషి వయి యుండు మవల
మోక్షసామ్రాజ్యలక్ష్మిని బొందఁ గలవు. 110

వ. అని యనంతపద్మనాభుం డానతిచ్చిన విశ్వామిత్రుం డాపర్వతంబున వేనవేలు వర్షంబులు దివ్యతపంబు గావించి సిద్ధిం బొందె నని చెప్పి యముండు నరకవాసుల దిక్కు మొగంబై మీ రట్టిదివ్యస్థలంబుల సేవించి వానిలో నుత్తమోత్తమంబై ప్రదీప మనుపేరుగల తోతాద్రిపై చక్రినాభ్యంతరమున నున్ననారసింహుని సేవింపుఁడు మీకీనరకబాధ లుడుగు ననిన వారు సూర్యాత్మజునాజ్ఞం గొని నానావిధదివ్యస్థలంబులు సేవించుచుఁ దోతాద్రికిం జనుదెంచి కళ్యాణసరోవరంబున జలకం బాడి నరహరికిఁ బానకంబు నివేదించి ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు వారికి మంగళంబు లొడఁగూర్చె దానంజేసి తోతాద్రి మంగళాద్రిసంజ్ఞం గాంచె నది కృతంబునఁ దోతాద్రి యనియుఁ ద్రేతాయుగంబున స్తోత్రాద్రి యనియు ద్వాపరంబున ముక్త్యద్రి యనియుఁ గలియుగంబున మంగళాద్రి యనియు వ్యవహరింపఁ బడుచుండు నని చెప్పిన శంకరుం గాంచి శాంకరి క్షేత్రమాహాత్మ్యం బెట్టిది యెఱింగింపు మని యడిగె ననిన నైమిశారణ్యవాసు లావృత్తాంతం బెఱింగింపు మని సూతు నడుగుటయును. 111

ఆశ్వాసాంతము.

చ. దినము దినంబు నూర్గు రరుదెంచిన నెంచక యెల్లవారికిన్
దనగృహమందు భోజన ముదారతఁ బెట్టుచుఁ బెట్టుచెట్టునాఁ
బొనరి మహోన్నతుండగుచుఁ బుత్రుఁడు తన్ను భజించుచుండఁగా
వినుతికి నెక్కె గర్తపురి విజ్ఞుఁడు లక్ష్మినృసింహుఁ డున్నతిన్. 112

గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ కవి
సార్వభౌమ ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన
మంగళగిరి మాహాత్మ్యంబునందుఁ
ద్వితీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

# మంగళగిరిమాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము

— : —

క. శ్రీమద్బాలాంబాపా
దామృతసంభూతసేవ సధికశ్రీకుం
డై మించెడువినపాముల
భూమిసురుం డెసఁకమెసఁగు భూరియశమునన్. 1

### —♦ క్షీరవృక్షవృత్తాంతము ♦—

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లడిగిన శాంక
రికి శంకరుం డిట్లనియె. 2

సీ. శశిబిందుఁ డనురాజు సర్వసుందరి యను
తనసతితోడఁ దీర్థముల నాఁడఁ
దిరుగుచు నొకనాఁడు తెరువునఁ దోతాద్రి
కరుదెంచి కళ్యాణసరసునందు
నాడి దేవుని గొల్చునప్పుడు నారదుం
డట వచ్చి రాజేంద్రు నరసి యనియె
ధరణీంద్ర! నీ వేల ధరణీతలంబున
నిట్లు మెట్టుచునుంటా యింతితోడఁ

తే. జెప్పు మనుటయు రాజు పూజించి నాకు
రాజ్యపాలనమందు సర్వంబునందు
మఱియు సంసృతియందును మమత లేదు
కాన నీరీతి చరియింతు మౌనినాథ. 3

వ. నీయనుగ్రహంబు గలదేని నే నిటఁ దపించుచుండు ననిన నారదుం
డట్ల యగుంగాత మని వానిఁ దపశ్చర్యాసక్తుం గావించె నది విని

సర్వసుందరి డెందంబున సమందామర్షం బగ్నినోలె మండ మానిదిక్కు మొగంబై 4

ఉ. నాదువయోవిలాసములు నాదగుసుందరతాపరిశ్రీయుఁ
నాదగుసౌకుమార్యమును నాదగుచెల్వము సర్వమంగళం
బై దెసలంటి పోవ నిటులాడు దె నాదుమనోహరాంగునిఁ
నాదగుసంస్మృతిం జెఱుప న్యాయమె నీ కిటు మానినామకా. 5

తే. స్త్రీ నయిననాకు సంస్మృతిచ్ఛేదక మగు
చేఁతఁ జేసితి గావునఁ జెప్పెద విను
మిచట నీ వొక్కవరదుగ్ధవృక్ష మగుచు
మొలచి స్త్రీజాతికుపకృతుల్ సలుపు మిచ్చ. 6

సీ. అందుబాటగుచోట నద్రిపై నొకపాల
చెట్టయి పుట్టుము పుట్టి పెఱిగి
నిన్ను నీక్షించిన నీరజాక్షులకు సౌ
ఖ్యము సౌకుమార్యము కామసుఖము
గలిగించుచుంటయు గాక ఋతుస్నాత
యెవ్వత నీకడ కేగుదెంచి
కొలుచు నస్దానికి గోత్రాలికిని దివ్య
సంతాన ముదయించుసరణి సలుపు

తే. మఱియు స్త్రీ యెట్టిపాప మేమఱి పొనర్చె
నేని యది యెల్ల నీకడ కేగుదెంచు
నంతలోపల నేగెడునట్లు చేయు
చుండు మని మాని శపియించె నోప్పి యాపె. 7

వ. అని శపించిన నారదుండు సమగ్రుం డయ్యు నప్పతివ్రతవాక్యం బన్యథాప్రవర్తింపఁ జేయ నిష్టంబు గాని నెమ్మనమ్మున నయ్యమ్మం గాంచి యిట్లనియె. 8

తే. నేను జెట్టు నగుచు నుండి నీవు చెప్పి
నట్లు స్త్రీలకు నుపకృతు లాచరింతు

నీవు నీభర్తతోఁ గూడి వేవిధములఁ
గ్రీడలం దేలుచును శుభశ్రీ నెసఁగుము. 9

వ. నీకు వేగురుపుత్రు లుదయింతురు గాక యనిన నానందించుచు నామె దేవదేవునిదిక్కు మొగంబై పార్థించిన దేవుండు ప్రత్యక్షంబై యి ట్లనియె. 10

సీ. సృష్ట్యాదియందు నీక్షేత్రము బ్రహ్మచేఁ
గ్రోశమాత్రంబుగాఁ గూర్పఁ బడియె
సకల చరాచర జంతువులకు మోక్ష
మిచ్చెడు నిది జగదీడితంబు
క్షేత్రపాలకుఁ డయి శ్రీరామభక్తుఁడై
యాంజనేయుం డిందు నతిశయిల్లు
నది పుణ్యావృతమ్ము [illegible] గాండజం [illegible]
నిండి [illegible] మిందు

తే. బ్రహ్మదేవుఁడు మున్ను తపం బొనర్చె
నేను లక్ష్మీసమేతుఁడనై నగమునఁ
జక్రరాజమునందు నవక్రవిక్ర
మక్రమమ్మున విహరింతు మగువ మిన్న. 11

ఉ. నారదమౌని చెప్పినటు నాంచి! నీవు బహుప్రజాళి తో
ధారుణిపై మహాసుఖము తత్పరతం గొని యుండు నీప్రియుం
డై రహించుచునీతఁడు సమాదరణంబున నిన్నుఁ జూచు నా
పై రమణింతు రీరు హరిపార్శ్వచరావళి నగ్రగణ్యులై. 12

వ. అని తిరోహితుం డయ్యె శశిబిందుండును సుందరీసహితుండై నిజపురంబునకు నిర్గమించె నారదుండును క్షీరవృక్షుండై నారీజనరక్షకుం డయ్యె నింకఁ గళ్యాణసరోవరవృత్తాంతంబు చెప్పెద విను మని విశ్వేశ్వరుండు వెండియు. 13

—♦ లక్ష్మీకళ్యాణ సరోవరము ♦—

సీ. అత్రిపుత్రుం డగునతఁడు దుర్వాసుఁ డొ
క్కదినంబునన్ మునికలితుఁ డగుచు

స్వర్గంబునకుఁ జని శతమన్యు దర్శించి
పూత మాతనపారిజాతమాల
వాని కర్పించిన దాని నాతఁడు తీసి
యైరావణ శిరంబునందు వైచె
నది దాని నిల వైచి పదములం జూర్ణించె
దుర్వాసుఁ డది కంటితోడఁ జూచి

తే. ఓరి దేవేంద్ర! గర్వివై యుంటి కాన
నీదు సంపద యిది యెల్ల నిలువ కింత
లోన నశియించు నని శాప మూని పెట్టి
తాను దనవారితోఁ గూడి తరలి పోయె. 14

వ. అంతఁ గొంతలో ననేకోత్పాతంబులు పుట్టుటం జేసి దివస్పతి గీష్పతి ప్రభృతులకా రాఁ బనిచి శాపవృత్తాంతం బెఱింగించి యుత్పాతంబులు నుపద్రవంబులుం జెప్పి శాంతి గావింపుఁ డనిన బృహస్పతి వానిం గని పురందరా! మనము దీని నివర్తింపఁ జేసికొనం జాలము నీతండ్రి కశ్యపప్రజాపతికడకుం బోయి నివేదింత మన నెల్లవారు నల్లన కశ్యపప్రజాపత్యాశ్రమంబునకుం జని తత్ప్రకారం బంతయు నెఱింగించుటయు నతండు తనయాశ్రమంబున నింద్రాదులచే విష్ణ్వారాధనంబు గావించె నపుడు శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై మీ రెల్లరు పాలసముద్రమును మథింపు డందు నమృతంబు పుట్టు దాన సర్వార్థసిద్ధులుం బడయ వచ్చు నని నియోగించుటయు. 15

సీ. దేవదానవులు శ్రీదేవీమనోహరు
నాజ్ఞనై క్షీరాబ్ధియందుఁ బొంద
వివిధౌషధలతాది విసరముల్ పడవైచి
మందరాద్రిం దెచ్చి మంథదండ
మొనరించి వాసుకిం గొని వచ్చి తత్రాడు
గాఁ జేసి త్రచ్చి రాకడలి నంత
నప్సరసలు చంద్రుఁ డైరావణంబు ను
చ్చైశ్శ్రవంబును శ్రీయు సంభవించె

తే. అంత నమృతము జనియించె నది గ్రహించి
యింద్రముఖ్యులు దుర్వాసుఁ డిడినశాప
మునఁ దటస్థించు నోగు వోఁ బొనరుచు కొని
వ్యాధు లాధులు లేకుండ వఱలుచుండ్రు. 16

ఆ. అల్లపాలవెల్లియందు లక్ష్మీదేవి
జనన మంది నపుడు చక్రధరుఁడు
వలచె నామెఁ జూచి వనజాక్షియును వానిఁ
జూచి వలచె నపుడు శుభ మెసంగ. 17

వ. అయ్యవసరంబున. 18

శా. నేనున్ బ్రహ్మయు నింద్రుఁడున్ సురలు మౌనిశ్రేష్ఠులున్ వారికిన్
సానందంబుగఁ దోతపర్వతముచెంతం బెండ్లిసేయంగ సం
ధానంబుం బొనరింప నప్పు లమరుల్ తా దెచ్చియే మంగళ
స్నానంబుం బొనరించి రిందిర కటన్ గళ్యాణ మేపాఱఁగన్. 19

క. ఆక్ష్మాతలమందున్ శ్రీ
లక్ష్మీకళ్యాణ మనఁగ లక్షింపఁగ నా
లక్ష్మముగ సరసి వొలిచెన్
లక్ష్మీప్రద మగుచు స్నాతులకు మే లిడుచున్. 20

తే. రవి మకరమందు నుండఁ ద్రిభువనములను
నలరుతీర్థము లెల్లఁ గళ్యాణసరసు
నందు సన్నిధిఁ జేసెడు నందువలన
లక్ష్మీకళ్యాణతీర్థము లక్షిత మగు. 21

ఉ. పానక మాజలంబులనఁ బర్వఁగఁ జేయుచు స్వామి కెల్లరున్
మానుగ నారగింపులు పొనర్తురు వేఱొకనీటఁ జేయ న
ప్పానకమున్ గ్రహించుటకు స్వామి పొనర్పఁడు చిత్త మందునన్
మానవు లెల్లరుం దెలిసి మాన్యపదంబును బొందు టొప్పగున్. 22

క. పంచమహాపాతకులేఁ
గొంచక కళ్యాణసరసిఁ గొన్ని జలంబుల్

పాలించదగతి శీర్షముపై
నుంచుకొనం బూతు లగుచు నొప్పెద రవనిన్. 23

వ. ఇది లక్ష్మీకళ్యాణ సరోవరప్రభావ మింకఁ గిటితీర్థవృత్తాంతంబు
చెప్పెద విను మని మఱియును. 24

## —♦ కిటితీర్థవృత్తాంతము ♦—

మ. అరయన్ లోకభయంకరుం డగుహిరణ్యాక్షుండు తా బ్రహ్మాజ్ఞుఁడై
పరిపంథి ప్రకరంబులన్ రణమునన్ బల్మారు నిర్జించియున్
ధరణీచక్రముఁ జాపఁజుట్టి జలధిన్ డాగె న్మహోపప్లవం
బరుదై తోప వరాహరూపమున దున్మాడె న్విధుం డాతనిన్. 25

ఉ. యజ్ఞవరాహమూర్తి యయి యద్దివిజారిని సంహరించి స
ర్వజ్ఞుఁడు భూమినిం గలియ వచ్చినయప్పుడు పుట్టె నట్టిదు
ష్ప్రజ్ఞుఁడు రాక్షసాంశము ప్రవర్తిలగా నరకాఖ్యుఁ డయ్యెడన్
విజ్ఞులు మెచ్చి రెంతయును విస్మితరీతిని బ్రస్తుతించుచున్. 26

తే. అట్లు భూదేవినిం దెచ్చినంత బ్రహ్మ
ముఖ్యు లాతనిచెంతకుఁ బోయి వివిధ
విధములం బ్రస్తుతించిరి విష్ణుఁ డెల్ల
వారి నానందవారిధిఁ బర్వఁ జేసె. 27

వ. అంత నయ్యాదివరాహమూర్తి వైష్ణవాశ్రమ మయిన మంగళాద్రి
క్షేత్రంబున కరుగుదెంచి తనమే నట విదళించె నందు [illegible]
బిందువులు హ్రస్వశృంగి కుత్తరభాగంబునఁ గిటితీర్థ[illegible] సరోవరం
బయ్యె నందలిస్నానదానాదికంబు గంగాదితీర్థస్నానంబు కన్న [illegible]
మడుంగు అధికం బయి పాతకంబులం బాపు నింకఁ [illegible]కతీర్థప్రభా
వంబు చెప్పెద నాకర్ణింపుఁడు. 28

## —♦ చక్రతీర్థప్రభావము ♦—

క. హరికిం జక్రాయుధముం
గరమరుదుగఁ జేసి [illegible]

బరిపరిరీతులఁ దద్వ
త్సరతుం డగుచుఁ ద్వష్ట తనరెం దొలుతన్. 29

వ. అట్టికాలంబున. 30

తే. వెన్నవలకన్న వేఁడివే ల్పెన్న మున్న
త్వష్టకూఁతు సంజ్ఞాదేవిఁ బత్నిఁ గాఁగఁ
బడసి యమునను యముని వైవస్వతమను
వును గనియె లోకరక్షణ మొనరుపాంకె. 31

తే. త్వాష్ట్రి యైనసంజ్ఞాదేవి తనరుచు నుష
యనఁగ నానాఁటి కభివృద్ధి నందు నర్క
వేఁడికిం దాళఁ జాలక వెగడు గుడిచెఁ
గ్రాఁగిపోయెడు దేహంబు గలది యగుచు. 32

ఉ. ఏమి యొనర్చుదాన నని యెంతయుఁ జింతిలి యంతలోన న
క్కోమలి మేనినీడ నిజకోమలరూపము గా నొనర్చి లోఁ
బ్రేమ చెలంగ నామె కను వేగమ నావలెఁ బోయి యిత్తఱిన్
నే మఱి వచ్చుదాక రమణీ! మదపత్యముఁ బ్రోచుచుండుమా. 33

వ. అని నియోగించి కార్యపరతంత్రయై. 34

చ. గురుసవిధప్రదేశమునకుం జని భావముఁ దెల్పఁ ద్వష్టయున్
గరితను గాంచి యిట్టులను గాదిలికూఁతుర! విష్ణుదేవునిన్
బరమతపోవ్రతంబులను భక్తిమెయిన్ భజియింపు మందునన్
నిరతసుఖంబు నందెదవు నీ వని చెప్పిన నప్పుడంతియున్. 35

వ. అని తండ్రి బోధించిన సంజ్ఞాదేవి యత్తఱి నుత్తరదేశంబుల కరగి
బడబయై బహుళతపంబు గావించుచుండె నంత నచ్చట. 36

తే. ఛాయ యుషవోలెఁ బోయి భాస్కరునిఁ గూడి
శని మొదలగుబిడ్డలఁ గని సవతికొడుకు
లైనతమ్ముల నిరాకృతి నరయు నరసి
యముఁడు వైవశ కిన్కయై నావెఁ దన్నె. 37

వ. ఇట్లు తన్నిన యమునిం గని ఛాయ సాయనికోపంబున, 38

క. తన్నినసీకాళులు వి
చ్ఛిన్నము లగు నని శపింప శీర్ణచరణుఁడై
దున్నవజీరుఁడు పొక్కుచు
వెన్నునివలకన్నుఁ జేరి వినుతించి యనున్. 39

శా. తండ్రీ! నాదురవస్థ కంటె తలి యేతద్రీతిఁ గుప్యన్మతిన్
గండ్రల్గా శపియించె నాత్మజుల వీఁకం జంప నుంకించువా
రుండ్రే యిగ్గతి తల్లు లెందయిన లో నూహింపఁగాఁ జెల్లు నీ
గుండ్రాడెంపముచాన మజ్జనని యొక్కో కాక యం కొక్కెకో.40

తే. అనినఁ బుత్రునిపల్కులు విని దినమణి
విస్మయాన్వితుఁడై మనోవీక్షణమున
సర్వమును గాంచి సమవర్తి సమ్మతిల్లఁ
దెల్లముగఁ బల్కె యప్పుడె దివ్య లలర. 41

సీ. సప్తకులగ్రావ సహితాబ్ధిమేఖలఁ
గ్రిక్కదలించురింఖలు దలిర్ప
బ్రహ్మాండభాండము బ్రద్దలు గావింపఁ
గాఁ జాలుహేషలు గ్రందుకొనఁగ
దళపరిపండువెన్నెలలు గాయఁగ సారె
సారెకుఁ గదులుపుచ్ఛంబు వెలుఁగ
దంతకోరకదీప్తిఁ దళుకుఁ జూపెడుపరి
స్ఫురణములం దగుప్రోథ దనరఁ

తే. బరఁగ నాస్కందిత ప్లుత వల్గితములు
ధోరితక రేచితములు నాధారలైదు
మిక్కుటంబుగఁ బరవళ్ళు ద్రొక్కికొనుచు
సర్వసత్తమ మయ్యె సప్తాశ్వుఁ డపుడు. 42

వ. ఇట్లతిమనోహరతురంగంబై మనోజవంబున నిజవనిత వసించుకడ కరిగిన వ్రతపరాయణ యగునామెయుఁ గామాతురత్వంబున వికృతంబుగ సకిలించుచు నశ్వరూపంబున వచ్చుసప్తాశ్వుం గని భయభ్రాంతచిత్తయై యత్తఱిఁ దత్తరంపడి హత్తువచ్చునచ్చెడుగు నాప

నేపురుషుండు నిట నోపి యుండం డనితలంచి తలంకి తత్క్షణంబ దక్షిణాభిముఖియై నర్మదాద్యఖిలనదీనదంబులు దాటి పాఱిఁజొచ్చె సప్తాశ్వుండును వెంట నంటి నామె పృష్ఠస్థానం బాఘ్రాణించినంత నుషయు నతని నిజాధినాథునిగ నెఱింగి తదిష్టక్రమంబునం బ్రవర్తించె నపుడు నాసత్యులు పుట్టి దేవవైద్యులై రనంతరంబ వారిరువురు నిజాకారంబులు దాల్చి రప్పుడు దేవతలతో నటకు వచ్చిన విశ్వకర్మం గాంచి కర్మసాక్షి యిట్లనియె. 43

శా. మామా! నీతనుజాత కెట్లయిన భీమం బైన మత్తాపముల్
సామాన్యస్థితి నోర్వగాఁ దగునొ యాచందంబునం జేయు మీ
నా మేలం చతఁ డట్లుగా నతని సానంబట్టి నాఁ డయ్యుషా
శ్యామల్ మోదరసార్ద్రఁ జేర్చె జగముల్ సంతోషముంబొందగన్.

వ. ఇట్లు దినమణిన్ సానఁబట్టి రాలినపొడిం జేసి విశ్వకర్మ సహస్రారం బగువిష్ణుచక్రముం జేసి దానికి సుదర్శనం బనుపేరు పెట్టి విష్ణుదేవునకు సమర్పించె నతండు దానం జేసి రాక్షసాంతకుం డయ్యెఁ దచ్చప్రభావంబు చెప్పెద నాకర్ణింపుము. 45

—♦ వి ష్ణు చ క్ర ప్ర భా వ ము ♦—

సీ. ఆసుదర్శనతేజ మాకృతిం గొని యొక
కాలమునన్ హరిఁ గాంచి పలికె
నాదుపామర్థ్యమునన నీవు శత్రుల
నుక్కడించి యశంబు నొందు చుంటి
నేలేక యుండిన నీకుఁ బేరు ప్రతిష్ఠ
లేకుండు నన హరి వీఁకఁ జేసి
నాలీలలం గాంచె నీలావు మెఱసెడుఁ
గాకున్నఁ గదలఁగ గలవె నీవు

తే. అనుచుఁ బెనువాదు పడినప్పు డచ్యుతుండు
పలికె నే నరసింహాంశకలితుఁడ నయి
పుట్టి పరశువుతో నిన్నుఁ బోరుకొందు
వేయిచేతులతో నీవు వెలయు మిలను. 46

వ. అప్పుడు మనతారతమ్యము లోకమునకుం దెలియ వచ్చు నని హరి యంతర్ధానంబు నొంది భూలోకంబున జమదగ్నికి రాముండై పుట్టి పరవుఁ ధరించె సుదర్శనంబును కృతవీర్యభూపాలునకుఁ గార్తవీర్యార్జనుండై పుట్టి పదునెనిమిదిద్వీపంబులకుం బ్రభువై సార్వభౌముం డయ్యె నయ్యవసరంబున. 47

సీ. కార్తవీర్యుం డొక్క-కాలంబునఁ జమ
దగ్నిమునీంద్రునిదర్శనంబు
గావింప నాతండు కామధేనువుఁ బుచ్చి
షడ్రసోపేతభోజనము పెట్టె
నపుడు రా జద్భుతం బని నరసి నీ కొకలక్ష
గోవుల నిత్తు నీగోవు నాకు
నిమ్మని యడిగియు నీకున్న ముని నొంచి
యర్జునిం దొడ్కొ-ని యరిగెఁ బురికి

ఆ. అడవినుండి రాముఁ డరుదెంచి గోవువృ
త్తాంత మెల్ల నరసి యపుడె కదలి
పోయి రాజు యుద్ధభూమిని వధియించి
గోవుఁ గొంచు వచ్చెఁ గొంతలోన. 48

వ. అంతఁ గార్తవీర్యాంతర్గతంబు చక్రాంశము చక్రిశాసనంబున వైష్ణవాశ్రమం బగు మంగళాద్రిక్షేత్రంబునందు హ్రస్వశృంగినామ ప్రదేశమున నున్ననరసింహదేవునిం బూజించి నృసింహస్థానం బగు చక్రంబునం జేరె నపు డాచక్రప్రవేశస్థానంబునఁ జక్రతీర్థం బుత్పన్నం బయ్యె నచ్చక్రతీర్థంబునం జేసినదానాదికం బక్షయఫలప్రదం బని చెప్పి వటతీర్థవృత్తాంతంబు చెప్పెద విను మని యి ట్లనియె.

—♦ వటతీర్థవృత్తాంతము ♦—

తే. అంబుజాక్షిరో! వినుము తోత్రాద్రి నిరృతి
భాగమందు నాడీజంఘువటము గలదు
దానిపేరిటఁ దీర్థము దనర నయ్యెఁ
దత్ప్రభావ మెఱింగింతు తవిలి వినుము. 50

సీ. కోసలాధిపుఁ డయి భాసిల్లువిష్ణువ
ర్ధనుఁ డనుభూపతి ప్రాజ్ఞుఁ డగుచు
నతఁడు విర్భరాట్సుతను బెండిలి యాడి
వైరాగ్యవంతుఁడై వదలె నామెఁ
గామపీడిత యగుకాంతావతంసము
బకముగా శపియించె భర్త విసివి
విష్ణువర్ధనుఁడును వెలఁదిని శపియించె
వటవృక్షమై నీవు వఱలు మనుచు
తే. ఇర్వు రీరీతి శాపముల్ పర్వఁ జేసి
కొనుచు బకవల్లభుం డయి పెనిమిటియును
మఱ్ఱివృక్షమై పత్నియు మంగళాద్రి
మహితలంబునఁ బుట్టిరి మహిమ దఱిగి. 51

క. నాళీజంఘాఖ్యుం డై
గ్రాలుచు బకవల్లభుండు ప్రాజ్ఞుం డగుచుఁ
గాలము గడపుచు నుండెను
వాలాయము వటమునందు వాసము గాఁగన్. 52

వ. ఇట్లున్నకాలంబున. 53

తే. మధ్యదేశీయుఁ డగునొక్కమహీసురుండు
బ్రహ్మవర్జిత మగునొక్కగ్రామ మధిక
వృద్ధియుతముగ నుండుట బుద్ధి నెంచి
భైక్షకాంక్ష నటకుఁ బోయె గ్రాసహారి. 54

ఆ. పండువంటికులము పాడుగా విప్రుండు
భిల్లపల్లియందు భిల్లవల్ల
వాధరీప్రసంగబోధితుండై కొన్ని
హాయనంబు లుండె నధముఁ డగుచు. 55

ఉ. బోయలతోడ బాణ మరి వోయుట యేయుట నేర్చి బాడబుం
డేమెడ నిర్ఘృణుం డగుచు నెల్లమృగంబుల నేయువాఁడనై

పాయనిదీక్ష నవ్వానులఁ గ్రాలెడువక్షులఁ జంపి నిచ్చలుణ్
బోయలతో సముం డగుచుఁ బొ్రిద్దులు పుచ్చుచునుండె నిచ్చమై.

వ. ఇట్లు కొంతకాలంబు గడచినంత వాఁడు ధనార్జన తత్పరుండై కొందఱు సార్థవాహులుసముద్రతీరంబునకుం బోవుచుండఁ దానును వారితోడంబడి పోయె నపుడు వా రందఱు కొండమార్గంబు వట్టి చనుచుండునంతలో నొక్కవనగజంబు వచ్చి మత్తిల్లి యున్నయది గావున నెల్లరం బట్టి కాళ్ళ మట్టి మట్టువెట్టె నట్టియెడఁ గొందఱు బేహారులు చావునకుఁ గాక తప్పించుకొని పోయిరి పాఱుం డును నావారణంబుబాఱింబడక భయంబునుండి విముక్తుండై ప్రాణంబు లరచేతం బట్టుకొని యుత్తరదిగ్భాగంబు వట్టి యేకాకియై పఱచి సముద్రప్రాంతకాంతారంబునం జొచ్చె నదియుఁ బుష్పఫల భరితరసాలసాలతాలతక్కోలతమాలకాలాగురుప్రభృతి నానావిధ పాదపసముపేతంబును నానావిధశకుంత సమంచితంబునై కరంబు డంబుమీఱు నం దాబ్రహ్మబంధువు విహరించుచుం బోవఁ బోవ ముందట సువర్ణసికతాంచితతలంబును సువిశాలంబు నగునొక్క సమప్రదేశంబు లోచనగోచరం బగుటయు నందు. 57

క. నలుగడఁ బ్రబలినశాఖల
విలసనమున వట్రు వగుచు విశ్వంభరకుణ్
నిలిపిన ఛత్రము పోలువున
నలరారు వటం బొకండు నతిరమ్యగతిన్. 58

క. ఆనందజనక మగుచున్
మానొందెడుమట్టిమాఁ్రికు చక్కటికి న్మా
ర్గానూనశ్రమ కగునా
మానిసి చని కూరుచుండె మన మలరంగన్. 59

వ. అప్పు డెందేనియుం జని యున్ననాడీజంఘుండు. 60

తే. వటముపైఁ గలగూటికి వ్రాల వచ్చె
నచ్చెరువు వడి ద్విజబంధు వరసి చూచి

పాసలం జేసి దానినిఁ బట్టి చంపి
తినఁగఁ దలపోసె మనమునఁ దెలివి మాలి. 61

వ. అంత నక్కొక్కెరయు నక్కిరాతునిచక్కటికిం జని మనుష్యవాక్యం
బుల నిట్లనియె. 62

ఉ. స్వాగత మయ్య యోపురుషవర్య! యదృష్టము మంచి దయ్యె న
భ్యాగతుఁ డెన్న విష్ణు వగు నస్తగతుం డరుణుండు సంధ్యయు౯
రాఁ గలిగెన్ మదీయగృహరాజము నం దిట నాతిథేయము౯
రేఁ గొని యేగఁగాఁ దగును రేపకడం బయనంబు సేయుచున్. 63

వ. అనిన నతండు విస్మితుండై చూచుచుండ నాడీజంఘుండు
మఱియు స్వాగతంబు వలుకుచు సాలపుష్పమయం బగుబృసిం
గల్పించి మందాకినీమీనంబులం దెచ్చి వహ్నిపక్వంబు గావించి
యిచ్చిన వాఁడు వానిం దిని సంప్రీతిం గొని యున్నంత విహంగ
మంబు శ్రమాపనయనార్థము తనగఱుదోయిం జేసి విసరి విశ్రాం
తిం గాంచినపదంపడి గోత్రనామంబు లడిగిన నతండు నేను ద్విజుండ
నని మాత్రము చెప్పె నవల బకవల్లభుండును వానికిఁ బల్లవపుష్పం
బుల శయనంబు గల్పించి యందు విశ్రమింపంజేసి. 64

క. ఎందుండి యెందుఁ బోవుచు
నిందుల కేతెంచినాఁడ వింతయు నాకుం
బొందుపడఁ జెప్పు మనుటయు
విందుం దిని తృప్తుఁ డగుచు విప్రుం డనియెన్. 65

ఆ. కూటిపేద నగుచుఁ గొన్ని దేశంబులు
తిరిగి తిరిగి యెందుఁ దెరువు లేక
యుదధిఁ జేరఁ బోవునోడబేహారుల
వెంట వచ్చినాఁడ విత్తకాంక్ష. 66

వ. అనిన బకవల్లభుండు చింతింపకుము నీకు ధనంబు ప్రాప్తించునట్లు
చేసెద నని వాని నిద్రవుచ్చె నంతఁ బ్రభాతం బగుటయు. 67

సీ. బకవల్లభుఁడు బ్రహ్మబంధువుం గని ద్విజ
వర! మధువ్రజ మనుపురవరంబు
కల దిచ్చటికి నాలుగవ్యూతు లెడము గా
రాక్షసేంద్రుఁడు విరూపాక్షుఁ డనఁగ
బలవంతుఁ డప్పురిఁ బాయక యుండు నా
కత్యంతమిత్రుఁ డీ వటకు నేగి
నాపంపు వినిపించి నీపని చెప్పుము
చెప్పిన నీయభీప్సితము దీర్చు
తే. బాట యిటు లని చెప్ప నాబాపనయ్య
పయనమై దారి నమృతకల్పంబు లైన
ఫలము లాహారముగఁ గొని పవలు రెండు
నడచి మేరువ్రజపురంబు కడకు నేగె. 68

వ. ఏగి నాడీజంఘునిపంపున వచ్చినాఁడ నని తనరాక ద్వారపాలకుల మూలంబున రాక్షసేంద్రునకు నెఱింగించి తదనుమతంబునం బురప్రవేశంబు చేసి ప్రభుదర్శనంబు గావించుటయు నతం డతని నతిగౌరవంబున గాంచి పూజించి యుచితాసనంబున నాసీనుం గావించి బ్రహ్మవర్చోవిహీనుం డగువానిం దేటిపాటుం జూచి వాఁ డధముం డని నిశ్చయించియు మిత్రునిపం పని యింతయు సంశయింపక బొక్కసంబు జూపి నీ కెంతకావలయు నంతఁ గొంపొమ్మనిన నమ్మనుష్యాధముండు. 69

చ. రతనములున్ సువర్ణములు రాసులు రాసులు గాఁగ ముల్లెలన్
గుతికకుఁ గొన్ని నెత్తిపయిఁ గొన్ని భుజంబులఁ గొన్ని వెన్నునం
దతుకుకొనంగఁ గొన్ని నడుమందుఁ గరంబులయందుఁ గొన్ని గొ
మిత మది లేక కట్టుకొని మెట్టుచు నెట్టుచుఁ బోయె మత్తిలెన్. 70

వ. ఇట్లతికష్టంబుగ మోయలేనిమోపు లెల్లమోచుకొని వచ్చి తెచ్చిన ముల్లె లన్నియు మఱ్ఱివృక్షంబుకడం బెట్టి మార్గమధ్యంబున నన్నపానంబులు లేమిం జేసి క్లాంతుండై నిట్టూర్పు నిగిడించుచు నట్టె చదికిలంబడుటయు మిత్రవత్సలుం డగునాడీజంఘుండు వడివడిం

బఱచెంచి నిజపక్షాగ్రవిక్షేపంబుల విసరి మార్గాయాసంబు నపన
యించి భోజనం బర్పించె వాఁడు భుజించి విశ్రాంతిఁ గాంచి తన
మనంబున. 71

మ. కడుఘోరం బిలు మోయలేనిబరువుల్ కాల్నెట్టినన్ మెట్టి పో
గసీయల్ గా వొక మూఁడునాళ్ల శనయోగం బుండ దిద్దారిలో
నడుమన్ ముల్లెల డింప నొప్ప దెటులైనం గొంతభక్ష్యంబు వెం
బడిఁ గొంచుం జన నౌ న దెట్లు సమకూర్ప న్వచ్చునో యిచ్చటన్.

వ. అని వితర్కించి కొంతవడికి. 73

తే. చేపలం జెల్లలం దిని చియ్యఁ బట్టి
యున్న దీకొక్కరాయి దీని నొగ్గిల్చి
చంపి కలమాంస మంతయు నంతరించి
వెంటఁ గొనిపోదు పాథేయవిధి నొనర్ప. 74

వ. అని కృతనిశ్చయుం డై యుండె నంత సాయంసమయంబగుటయు
నాడీజంఘుండు రక్షోగ్ర మట నొక్కనెగడిం బెట్టి దాని కెడగలుగ
వాని కొక్కసుఖశయనంబు గల్పించి శయనింపంజేసి తానుం
దత్పార్శ్వంబున విశ్వసించి నిదురించె నంతఁ గృతఘ్నుం డగునాదు
ర్బ్రాహ్మణుం డొకయింతయు ననుబంధంబు దలంపక లగుడంబున
దాని నొకపెట్టు పెట్టి చంపి. 75

ఉ. ఱెక్కలు వ్రచ్చి మేనఁ గలఱేకులు పుచ్చిశరీర మగ్గిలోఁ
బక్కవముం బొనర్చి చురి వ్రచ్చి శిరంబును గాళ్లు గోళ్లనున్
ముక్కులు డొక్క లెమ్ములును మూఁడియుఁ బుచ్చిపలంబుముద్దగా
నొక్కటి గాఁగఁ జేర్చుకొని యూడనిఁబాడె నతండు వేకువన్. 76

వ. అంత నక్కడ రాక్షసేశ్వరుండు తనపుత్రుం బిలిచి మనం బాత్ర
పడ ని ట్లనియె. 77

తరళము.

కటకటా మననాళిజంఘుఁడు కానవచ్చుట లేదు తా
నిటకు వచ్చెడుఁ బూర్వసంధ్యల నెప్డు నల్వ భజింపఁగా

నటకుఁ బోవుచు రెండుసంధ్యలు నాఖగోత్తమురాయి ప్ర
స్ఫుటమ యయ్యెఁ గలంగు నామది చూడకుండుట మిత్రునిన్.

మ. ద్విజవంశాపశదుం డొకం డతని సంధించెన్ దురాచారుఁడున్
గుజనుం డున్నతపాతకావృతుఁడు నాకున్ వానిపై సందియం
బు జనించెన్ వినరానికార్య మెదియో మోహంబునం జేసినం
డి జతం బేసెనొ తోఁప దీవు చని తండ్రీ! చూచిరమ్మింతయున్.

వ. అని నియోగించిన రాక్షసేశ్వరనందనుండు రక్షోగణసహితుండై త్వరితగమనంబున మత్తీవృత్తంబునకుం జని నాడీజంఘునికంకాళంబుఁ జూచి కన్నీరు మున్నీరుగ విలపించి వాని పదుగుఱుఁ గలసి కప్రాణునిమార్గంబు వట్టి. 80

చ. వడివడిఁ బాఱి పాఱి యొకవంక బకాంగపలాలపిండమున్
నడుమున గట్టిపెట్టుకొని నట్టడవిం బడి పోవుదుష్టునిన్
బొసకయి గట్టి పెట్టుకొని పెన్వడి రాక్షసరాజధానికిన్
మిసుకుచుఁ బోయి రాజునకు మించినదానిని విన్నవించుచున్. 81

వ. పదాసిచరణోద్ఘాతం బైననాళీజంఘుని శరీరమాంసపిండంబుతోఁ గృతఘ్నుం డగువాని ముందు త్రోసి చూపుటయు మిత్రవత్సలుం డగునతండు. 82

చ. కనుఁగొని బాష్పబిందువులు కన్గవఁ గాల్వలు గట్టి పాఱఁ గా
వనరుచు నేడ్చి నేడ్చినను వారిజలోచనలుం గుమారులున్
జనులును మంత్రులుం దొరలు సొల్వడి యేడిచి రార్తనాద మా
ఘనతరసౌధభాగములఁ గ్రమ్ముకొనం దెగఁదెంపు లేసినై. 83

ఆ. అంత. గొంతవడికి నారాక్షసేంద్రుండు
తెప్పిఱిల్లి పొలసుదిండ్లఁ జూచి
మడియఁ జేసి పాపమతి యైనవీనినం
జుడి భుజింపుఁ డెల్ల గడుపునిండ 84

మ. అనినన్ రాక్షసు లేము క్రూరుండును బాపాచారుఁ డౌవీనినిం
దిని పాపంబునఁ బోవఁజాలము దయాబ్ధీ! యంచు మ్రొక్కియు వే

యని ప్రార్థించిన నట్లకాళ భటులిరువురు యాకృతఘ్నుని మహా
సినికృత్తాంగునిఁ జేసి దస్యులకు నొసఁగి బెట్టిరడీ నావురుమ. 85

శా. వారా బ్రాహ్మణబంధు నీడ్చుకొనుచున్ వధ్యప్రదేశంబునం
జేరంబోయి యటన్ శితాయుధములన్ ఛేదించి చిత్రక్రియన్
గూరన్ముక్కలు చేసి దస్యులకు మోదం బొసంగుచు నీ వారు నీ
క్రూరకృత్యము ముట్టఁ జాల మనుచున్ గుమ్మెత్తి రప్పట్టునన్. 86

క. కుక్కలను బిలిచి వానికి
మెక్కం బెట్టంగ నవియు మెక్కం జని చే
దెక్కినగతి మూర్కొన కా
దిక్కుం గన కేగె భయము దీండ్రింపంగన్. 87

వ. అట్లు కుక్కలును ముట్టకున్ననప్పాపకుమాంసఖండంబు లొక్కచోఁ
గ్రిమికీటవ్యాదుల కాహారంబుగాఁ బోవవైచి రాజానుమతంబున
నొక్కరమ్యప్రదేశంబునఁ జితిం బేర్చి మట్టికడనుండి తెచ్చిన నాడీ
జంఘునికళేబరంబును బాపనిమొద్దం బుచ్చుకొనినసంజాడిముద్ద
యుం దానిపయిం బెట్టి యనలంబు దరికొల్పి ప్రేతకార్యంబు
నిర్వర్తించి రానమయంబున. 88

సీ. సురభి దాక్షాయణి సురవర్త్మమున నేగు
నది ఖగేశ్వరుచితి యడుగున బడఁ
గాపైఁ జపఁగ దానిపాలును వక్త్రపే
నము గూడి సొదమీఁద నమరఁ బడియెఁ
బడినంత నాడీజంఘుండు పునర్జీవితుం
డయి తొంటిరూపున నసురవిభుని
కడ కరుదెంచె నాక్షణమున శకుంతం
సాక్షాత్కరించి యిట్లని వచించె

తే. నీదుదిష్టము మంచిది నీసఖుండు
చచ్చి పుట్టెను వెండి రాక్షసవరేణ్య!
బ్రహ్మ శాపమిందించెఁ దను జూడ రావి వీని
దాన నిట్టు వచ్చె గోత్రఘాతపీనిఁ గాచె. 89

వ. ఆలో నాడీజంఘుండు దేవేంద్రునిదిక్కు మొగంబై నమస్కరించుచు
నాకు నాశ్రితుం డగునాబ్రాహ్మణబ్రువుండు తప్పు చేసినను వానిం
బ్రదికించి పుచ్చుట కర్థించుచున్నవాఁడ ననిన నెల్లరు వాని యుల్లం
బునకు సంతసించి రపుడు దేవేంద్రుం డమృతంబునం జేసి వానిని
బ్రదికించిన నాడీజంఘుండు వానిం బుజ్జగించి వానిధనంబు వాని
కిచ్చి యంపిపుచ్చె నింద్రుండును జనిన పదంపడి నాడీజంఘుండు
రాక్షసాభినందితుండై కొంతకాలం బట నుండి వానికిం జెప్పి
యొప్పించి నిజకులాలయంబునకుం జని యెప్పటియట్లు కాలక్షేపంబు
చేయుచుండె నప్పు డొక్కనాఁడు. 90

ఉ. అంచలు నింగినుండి తమకాలయ మానసమట్టిమీఁదికిన్
గొంచక వచ్చియున్నఁ గని కొంగయు వాని బహూకరించుచుం
బెంచిన ప్రేముడిం దినఁగఁ బెట్టియు నెట్టన నాదరించియుం
గొంచెము సేద దేర్చి యును గోరిక లిరిక లెత్తఁ బల్కుచున్.

తే. హంసరాజములార! మీ రజునియింట
వాహనం బగునంచలవంశమందుఁ
బుట్టియుండినవా రని పోల్చియుంటి
మీర లెటనుండి యిట వచ్చినారు చెపుడ. 92

మ. అనినన్ హంసలు మేము నిక్కపుజగంబందు న్నివాసంబునుం
గొని యున్నారము నిన్ను మే మెఱిఁగి కన్గొ నిట్లు స్తోత్రాద్రికిన్
జని దేవున్ భజియించి వచ్చితిమి విశ్వప్రస్తుతం బన్నగం
బని భాషించుచు హంసముల్ చనియె న య్యాకాశమార్గంబునన్.

వ. నాడీజంఘుండును నాఁడు మొదలు నిత్యంబు స్తోత్రాద్రికిం జని
నారసింహున్ భక్తిప్రపత్తుల నారాధించుచు నన్నగంబున నైరృతి
భాగంబునం దనఖరనఖరంబుల నొక్కకుండంబు త్రవ్వి పద్మపత్రి
పుటికలం గంగాజలంబు దెచ్చి దాని నిండించి యట ముక్తితీర్థ
సదృశంబుగా వటతీర్థంబు గావించె నది భక్తులకు భుక్తిముక్తిప్రదం

బని చెప్పినఁ బార్వతి పరమేశ్వరుం గాంచి మఱియు నాయాతీర్థ
ప్రభావంబు వినవలతుం చెప్పు మనుటయును. 94

## ఆశ్వాసాంతము.

ఘనుఁ డయి సత్యవాది యయి కావ్యరసానుభవాంతరంగుఁడై
ధని యయి కార్యదక్షుఁ డయి దైవతభక్తిసమేతుఁడై మహా
మునిజనసేవకుం డయి సుపుత్రకళత్రసుమిత్రయుక్తుఁడై
పొనరెడునారసింహబుధిముఖ్యుఁడు పొల్పెసలారుఁ గావుతన్. 95

## గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ కవి
సార్వభౌమ ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన
మంగళగిరి మాహాత్మ్యంబునందుఁ
చతుర్థాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ



.

శ్రీరస్తు

# మంగళగిరిమాహాత్మ్యము

## పంచమాశ్వాసము.

—:—

క. శ్రీమద్బాలానుజాసుతుఁ
డై మహిమం దనరి లక్ష్మి నాదిం గొననై
కామితము లిచ్చి శ్రితులకు
క్షేమం గనునారసింహవిభుఁడు చెసంగున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు తోతాద్రిం గలతీర్థంబులెల్లం జెప్పి పరమేశ్వరుండు పార్వతిదిక్కు మొగంబై మఱియు భక్తు లెవ్వరీక్షేత్రంబున ముక్తిం గాంచిరో తద్విధంబు చెప్పెద సావధానచిత్తవై వినుమని యిట్లనియె. 2

—♦ పురుకుత్సాదులు ముక్తులగుట ♦—

సీ. పురుకుత్సుఁ డనియెడుభూపతి విష్ణ్వాజ్ఞఁ
దోతాద్రి కేతెంచి ప్రీతితోడఁ
గళ్యాణసరసి సంకల్పపూర్వకముగా
నఘమర్షణస్నాన మాచరించి
వేదవిద్వరు లైనవిప్రపుంగవులకు
బహువిధదానముల్ భక్తి నొసఁగి
శ్రీచక్రగతనారసింహునిఁ బూజించి
సకలసంపదలను సతత మొంది
తే. చక్రవర్తులలోనఁ బ్రశస్తి గాంచి
యవనిఁ దనయంతవాఁడు లేఁ డనఁగ నొప్పి
పెక్కువేలేండ్లు ధర యేలి విశ్వ మెన్న
విష్ణుసాయుజ్యమును బొంది వేడ్క నెసఁగె. 3

తే. రంఘునాముఁడు రఘువంశసార్వభౌముఁ
డొక్కతఱిఁ దీర్ఘయాత్రల నొనరుచుమతిఁ
దివుపతుల నెల్ల సేవించి తిరిగి ముక్తి
పర్వతంబున కరుదెంచి భక్తి మీఱ. 4

వ. వరాహపుష్కరిణిం స్నానంబు గావించి నరసింహదేవుని సేవించి తత్పురంబునం గలదంపతుల కెల్లఁ బూజలం గావించి నానావిధ దక్షిణ లొసంగి పండితులఁ బహూకరించి పునరావృత్తిరహిత పుణ్యపదంబు నొందె ననంతరంబ. 5

మ. అనరణ్యుం డనుభూమిపాలకుఁడు సూర్యాచ్ఛాన్వవాయోద్భవుం
డనఘుం డొక్కపు డమ్మహాగిరికి భక్త్యావేశభూతాత్ముఁడై
తనకాంతామణితోడ వచ్చి నృహరిం దర్శించి సేవించి దే
వునకుం దివ్యమణీవిభూష లిడి పెంపుం గాంచె మున్నంతయున్.

తే. నాహుషుండు యయాతి మునుం దనదుముదిమి
వోయి యౌవనముం బొందుపొలుపు నెఱిఁగి
కొనియెఁ దోత్రాద్రి నారసింహునికటాక్ష
వీక్షణంబున స్వామి సేవించి నంత.

శా. ప్రాకారంబులు గోపురంబులు గుడుల్ స్వామ్యర్చనాపాత్రముల్
లోకైకేష్యము గా నొనర్చి పురముల్ గోధేనుదంత్యశ్వముల్
శ్రీకాంతుండు నృసింహదేవునకు సుశ్రీవైభవార్హంబుగా
భూకాంతుం డతఁ డిచ్చి చేసెనట వాపుల్ కూపముల్ చెర్వులున్.

—♦ ఇంద్రద్యుమ్నుఁడు గజమై ముక్తినొందుట ♦—

మ. ద్రవిడాధీశుని చంద్రవంశజుని నింద్రద్యుమ్ను మున్నయ్యగ
స్త్యవశీంద్రుండు శపించె మత్తకరివై జన్మింపుమం చంతభూ
ధవుఁ డాశాపమునం గరీంద్రుఁ డగుచుం దాఁ గానల న్మెట్టుచున్
సవతిం తేనియు లేని చందమున నెంచం జెల్లె దెల్లంబుగన్. 9

మ. కరిణీసంఘముతోఁ గరీంద్రుఁడు వనిం గౌతూహలం బేర్పడన్
నిరతంబుం జరియించు చొక్కపగటన్ నీర్వట్టునం గానలో

సరసిం గన్గొని నీరు ద్రావఁ జన రోషం బేర్పడ గ్రాహము
క్రూరికా ల్వ్యాప్తైను గట్టిపట్టుగ నెటుల్ కా త్కట్టి పోకుండఁగన్. 10

సీ. గోరుమొసలి పట్టుకొనినంత నంతయు
నాగ్రహంబున మదహస్తిహస్త
విన్యాసమున దాని వెన్ను విఱుగ నేసి
కడకాళ్ల గాఢము గాఁగఁ ద్రొక్కి
దంభోళి కృత్తగుదంతద్వయంబునఁ
దల బ్రద్ద లగునట్లు తట్టి కొట్టి
కొండపై పై కొండ గూలినట్లుగ దాని
మీఁదఁ దనమేను బూని నైచి

తే. ఫూత్కృతుల నేసి ఘీంకృతుల్ పొడుగుఁ జేసి
చుట్టు ముట్టాడి తోఁకతోఁ గొట్టి కొట్టి
స్థానబలమున నుక్కెక్కి తవరు దాని
నేమియుం జేయఁ జాలక గోము దఱిగి. 11

వ. దానిం గొట్టి దానిపట్టు విడిపించుకొన నెంతయేని ప్రయత్నించియు
సమర్థంబు గాక తనమనంబున. 12

ఉ. కొండలఁ బిండిగొట్టఁ గలకొమ్ములఁ గ్రొత్తితిఁ గొంచ మేనియున్
బెంపువడంగఁ బోక కడు ప్రేకటనంబుగఁ గాళ్ల మెట్టితిన్
దొండము గోడ వజ్రమును ద్రుంపఁగఁ జాలెడుదాన మోది న
కొండుగ నెట్టు చేసినను మిక్కిన బోవ దిది దక్కుటక్కటా. 13

చక్రప్రయోగంబున నక్రబాధం దొలంగించి గజేంద్రుం గాంచి నీవు నాభక్తుండవు శాపకారణంబునం జేసి యిట్లయితివి నీవు తోతాద్రిక్షేత్రంబున కేగి నృకేసరిదర్శనంబు చేసి నంత నీరూపంబు వాయ నగుఁ దొంటియట్లు మద్భక్తుండ వగుదు వని యాదేశించిన నతండు తదుక్తక్రమంబున మంగళాద్రి యందలిముక్తితీర్థంబున కేతెంచి జలంబాడి నంత శాపమోక్షం బై గజరూపంబు విడిచి పరమోత్తమరూపంబు నొంది నరహరిఁ సేవించి ముక్తుం డయ్యె ననంతరంబ ద్వాపరయుగాంతంబున. 15

—♦ ధర్మరాజాదులువచ్చి స్వామినిసేవించుట ♦—

ఉ. తమ్ములు కొమ్మయుం గొలువ ధర్మతనూజుఁడు విప్రకోటితో
నిమ్మహిఁ గల్గుకాననము లెల్లఁ గనుంగొనుచుం దినప్రియా
ణమ్ముల మంగళాచలమునం గలదేవుని నారసింహునిఁ
సమ్మతిఁ జూడ వచ్చి వ్రతచర్యల సేవ యొనర్చె నెంతయుఁ. 16

ఆ॥ కొన్నినాళు లచటఁ గోర్కెమై నివసించి
దినము దినము నృహరిఁ దివిరి కొలిచి
కొండ నెక్కి దిగుచుఁ గొండొకదినమున
నృహరిభక్తుఁ బంగు నెదుటఁ గాంచె. 17

సీ. తుంటెలవఱకు మే నంటినఁ గండెడు
నట్లింతయేఁ గాంతె మగుచు నుండఁ
దక్కభాగం బుండుతా వైనఁ దోఁపక
చేదోయి గదలించుకొఁ దలిర్పఁ
దనయంతఁ దా నేగి వనజనాభునిఁ జూచు
వాంఛ నెమ్మదిఁ జేసి భక్తవరుఁడు
మెట్టుపై మెట్టెక్కి నట్టి డొల్లుచుఁ గాల
మే నెత్తి పైమెట్టుమీఁదఁ బెట్టి

తే. గడియకైన నొండొకమెట్టు గడవ లేక
కుటిలఁ గుశిపొడుపంగునిఁ గువలయేశుఁ

జైనధర్మజుఁ డీక్షించి యక్కటకట
భక్తసులభుఁడు కాఁ డయ్యెఁ బానకపతి. 18

వ. అని చింతించి భీమసేనుం బిలిచి పంగుం జూపి యిట్లనియె. 19

మ. నృహరిం జూడఁగ నిన్నిపాట్లు పడ నా నెవ్వానికిం గాని య
న్వహముం గొండకు నేగి బల్మి గలఁడైనం గస్తి నొందుఁ గుహా
ద్వహా! యాగ్రామమునందు వేఱొకనృసింహాళుం బ్రతిష్ఠింప నే
స్పృహ గావించితి గండకీనదిశిలల్ జేయించి తన్మూర్తినిన్. 20

వ. అది గావునఁ జెప్పెద నాకర్ణింపుము. 21

క. పోలించి నివు గండకి
సాలగ్రామంబు శిలను జయ్యనఁ గొని ర
మ్మాలక్ష్మిగుండముకడ
నేలన్ శోధించి యుంతు నీ వచ్చెదులోన్. 22

వ. అనిన భీమసేనుం డౌఁ గాత మని యనుజులకుం జెప్పి పయనంబై
పోయి గండకీనదిం గలమహోన్నతం బగుసాలగ్రామంబు సంత
రించుకొని వచ్చి యన్న కిచ్చిన నతండు దానిం బ్రతిమారూపంబు
గావించి వేదోక్తక్రమంబున మంగళాద్రినికటంబునఁ బ్రతిష్ఠించి
లక్ష్మీనారసింహుం డని నామకరణంబు గావించి షోడశోపచారం
బులం బూజించి కృతార్థుండై చనియె నంతఁ గొంతకాలంబునకు.

—♦ ఉత్సవవిగ్రహనిర్మాణము ♦—

మ. దిగువం బొల్చెడునారసింహునిగుడిన్ దీపింపఁగా నుత్సవా
నుగముల్ విగ్రహముల్ రచించుటకుమాన్యుల్ యత్నముంజేసి తా
మగసాలెం దగువాని నొక్కరుని సంప్రార్థించి తన్నిర్మితిన్
దగున ట్లాతనికి న్వచించి రతఁడుం దాత్పర్యముం జేయుచున్ 24

మత్త. విశ్వకర్మ యతండు విజ్ఞుఁడు విగ్రహంబు లొనర్చి తా
శాశ్వతం బగుకీర్తి నొందఁగ స్వాంతమందుఁ దలంచుచున్
విశ్వవిశ్రుతరీతి నుత్సవవిగ్రహంబు లొనర్చిన
న్లైశ్వరంబుగ మెనపుంబొడి నందు లోహము గూరిచఁగన. 25

తే. ఎంచి మనమున నచ్చంపుఁబంచలోహ
ములను గరఁగించి మైనపుఁబొమ్మలపయిఁ
బోయ నయ్యవి భిన్నత్వమునను బోవ
మఱియుఁ గరఁగించి పోయ నత్తెఱఁగె కాఁగ. 26

తే. ఖిన్నుఁడై యీశ్వరునిఁ గొల్చి వన్నె వాసి
గలుగునాతఁడు లోహముల్ గరఁగఁ జొచ్చె
నపుడు నరబలి యిమ్మనునట్లు వినఁగ
వచ్చినన్ విశ్వకర్మ విభ్రాంతుఁ డగుచు. 27

—♦ విశ్వకర్మ కుమారునిలోహరసంబునవైచుట ♦—

ఉ. దిక్కులు సూచుచున్నతఱి దేవళముం జొర వచ్చి తత్సుతుం
డెక్కవదాహ మయ్యెనని యేడ్చుచుఁ దోచిన వానిఁ బట్టి య
మ్మక్క యనం గలాదుఁడు దయారహితుం డయి మూసలోఁబడన్
జక్కనిపట్టిఁ బట్టికొని సాహస మేర్పడఁ ద్రోసెఁ ద్రోసినన్. 28

తే. మూసలోఁ బడి లోహంబుతో సమాన
ముగను నీ రయి పోయె నప్పుత్రకుండు
భక్తుఁ డప్పుడు పాకము వచ్చు నెఱిఁగి
యెత్తి మైనముపైఁ బోసెఁ దత్తరమున. 29

వ. దానంజేసి విగ్రహంబులు సమగ్రాంగంబులై చూపట్టిన నతం డంత
రంగంబున నుప్పొంగుచు నీశ్వరారాధనంబు గావించి కుమారా
రమ్ము దాహాభరంబు దీర్చుకొమ్మనినంతలో నబ్బురం బేఱుపడ
విగ్రహంబు నుండి యతండు వెలి వచ్చి తండ్రికిం బొడసూపె
నవ్వృత్తాంతంబు పౌరు లాకర్ణించి భక్తుం బూజించి విధిదృష్ట
విధానంబున నుత్సవవిగ్రహంబులకు సంప్రోక్షణాదికముం గావించి
పరిగ్రహించి దేవళంబునం బ్రతిష్ఠించి రని మఱియును. 30

ఉ. గ్రామము మంగళాచలముఖంబున మున్ను తలిర్చుచుండు నా
గ్రామము వర్షవర్షమును గాలుచు నుండుట గాంచి మున్ ముని,
గ్రామణి యొక్కరుం డచటి గ్రామణి కోరికిఁ జేసి కారణం
బామెయి మానసాబ్జమునయం దరయం గలఁడై నయంబునన్. 31

క. స్వామికి మూఁడవక న్నగు
గ్రామం బెదు రగుట నగ్నిఁ గాలుచు నుండున్
నామాటబడిని మీరీ
గ్రామము గిరిదక్షిణమునఁ గట్టుట లొప్పున్. 32

వ. అని చెప్పి మంగళగిరికి దక్షిణంబుగా గ్రామంబు గట్టించి దానికి నలుగడ నాలు గాంజనేయవిగ్రహంబులు ప్రతిష్ఠించి భూమదాంబరాదులు రాకుండ నగ్నిభయంబు లేకుండ దిగ్బంధనంబు గావించె నది మొద లటఁ బ్రజ లగ్నిభయం బెఱుంగక మారీస్ఫోటకాదుల పాలం బడక ప్రజలుసుఖం బుండి రని చెప్పియును.

—◆ గోపురమంటపాదుల నిర్మాణము ◆—

సీ. దిగువగుడికి నవాగ్రదిక్కునఁ గళ్యాణ
మండప మెంతయు మహిత మగును
వెండిబంగారులన్ వెలయింపఁ బడినవై
గరుడవాహనములు గ్రాలు నచటఁ
బొన్నవాహన మది కన్నులపండువై
గానంగ వచ్చు నాస్థానమందుఁ
జీఁకటికోనేరు చెన్నమీఱుచు నుండు
వ్రాలుగోపురమును వ్రాలనీక
తే. అస్థిభారము తక్కువై యచటిగోపు
రమ్ము మూలకు నొరగుట నెమ్మి నెఱిఁగి
దాని కెదురుగఁ గోనేరు త్రవ్వి నిలిపి
రప్పుడు శాస్త్రజ్ఞు లగుశిల్పు లద్భుతముగ. 34

తే. ఆంజనేయుఁడు మల్లేశ్వరాఖ్యశివుఁడు
క్షేత్రపాలకులై నారసింహమూర్తి
గూడి మంగళగిరియందు వేడుక మెయి
భక్తకోటికిఁ బ్రోతురు భుక్తిముక్తుల నిడి. 35

ఉ. స్వామిరథంబునందు ముఖభాగమునం గలపల్లెలందు నా
గ్రామమునందు నెల్లెడలఁ గ్రాలెడుగంట్లను గోపురంబులున్.

సీమలు దక్షిణంబునను శ్రీరఘురామచరిత్రచిత్రముల్
పైమొన భారతార్థమును భాగవతంబును జెక్కి మక్కువన్. 36

వ, ఇంక నుత్సవంబు తెఱం గెఱింగించెద నందు ముందు నపాహ్నిక దీక్షావిధిం జేర్కొందు నాకర్ణింపుడు. 37

—♦ ఉత్సవప్రకారము. ♦—

సీ. ముక్కంటికంటినిప్పునఁ గాలి బసుమమై
మదనుఁడు శ్రీకృష్ణసదనమందుఁ
బ్రద్యుమ్నుఁడై పుట్టి పదినాళ్లపురిటిలో
శంబరాసురునిచే జలధినిఁ బడి
చేపకడుపులోనఁ జేరి మాయావతి
యనురతి పెంచుటఁ దనర నగుచు
శంబరుఁ బరిమార్చి సతి యగురతితోడ
ద్వారవతికి వచ్చి తల్లిఁ దండ్రి

తే. సంతసంబునఁ దేలించి జగతిలోనఁ
దనదుపేర నుత్సవములు దనరునట్లు
సలుపు మనఁ గృష్ణదేవుఁ డుత్సవము తొమ్మి
దహము లొనరింపఁగాఁ జేసె నతిముదమున. 38

వ. అయ్యుత్సవం బీమంగళాద్రియందుఁ బ్రతివర్షంబును ఫాల్గుణశుక్ల సప్తమి మొదలుకొని పూర్ణిమవఱకు జరుగుచుండునట్లు భగవదాదేశంబునం జేసి మహోన్నతంబుగాఁ జరుపుచుందు రని మఱియును.

తే. అట్లు తొమ్మిదినాళ్ళు తోత్రాద్రియందు
నిత్యసేవలు మేళముల్ నృత్తములును
ధూపదీపనైవేద్యముల్ శ్రీపతి కట
సలుపుచుందురు సంతోషితులు లగుచు. 40

క. ఆయుత్సవసందర్శన
మే యుత్తములకు లభించు నేఁటేట నతం
డాయుష్యం బారోగ్యము
పాయనిసంపదలు గల్గి భాసిల్లు నిలన్. 41

వ. మఱియు నవపల్లవోత్సవము జలస్నానోత్సవము చాతుర్మాస్యో
త్సవము తోరణోత్సవము ప్రసవోత్సవము పక్షోత్సవము మాసో
త్సవము లోనగునుత్సవంబులు సంతతంబును దోతాదిం బ్రివర్తి
ల్లుచుండు నయ్యుత్సవదర్శనం బనంతపుణ్యప్రదం బని మఱియును.

క. పానకము చేయుపొంకెను
మానవు లానగముమీఁది మంటపమధ్య
స్థానమున సంతతంబున్
సానల మద్దిం త్రు గుడము జలములఁ గూర్చన్. 43

ఆ. అచట నాల్గుకడలయందు బెల్లంబును
బానకంబు వడుటఁ బాకము బలె
నగుచుఁ దైద్దికులకు నడుగుల నంట నై
దేహరోగములను దెఱలఁ జేయు. 44

ఆ. ఈఁగ చీమ దోమ యెప్పు డాబెల్లము
పానకంబుమీఁద వ్రాలఁ బోవు
నృహరియాజ్ఞ లేమి నిదిమహత్వంబు ప్ర
త్యక్ష మగుచు నుండు నం దెపుడును. 45

వ. ఆపానకప్రభావంబు దేటపడ నొక్కకథ గలదు చెప్పెద నా
కర్ణింపుఁ డని మఱియు. 46

## ——♦ పానకప్రభావము ♦——

ఉ. మున్నొకకాలమందు జయపూరనుపేరఁ దలిర్చు పత్తనం
బున్నతవైభవస్థితుల నొప్పుచు నుండెడు నందు మాధవా
ఖ్య న్నెగడొందుభూసురుఁ డొకం డగు నాతఁడు పూర్వకర్మసం
పన్నమహోగ్రపాపమునఁ బాడి దొఱంగెను గుష్ఠరోగి యై 47

క. ఎన్నోమందులు ప్రమాఁకులు
విన్నంతన తెచ్చి తినియె విడువక ప్రతముల్
కొ న్ననక యున్న వన్నియు
నన్నరుఁ డొనరించెఁ బెక్కుహోమనము లొగిన్. 48

తే. ఎన్ని చేసినఁ గాని నాహీనపుణ్యు
సకుఁ దదామయశాంతి కొంతయును గల్గ
లేదు గాళ్లును జేతులు లేమిడిఁ బడ
వ్రేళ్ళు గోళ్లును లేనట్టివిధము నయ్యె. 49

ఉ. అప్పుడు ప్రాణముల్ విడుచునట్టిఁడ నై యలమాధవుండు లో
నిప్పులు నీళ్ళు త్రాళ్ళు మరణింపఁగఁ జేసెడుసాధనంబులై
యొప్పెడు నంచు నెంచు చెదియో తలపోయుచు నుండు నంతలోఁ
జప్పుడొకింత వచ్చి తనజానుగులం బడె మేలు గూర్పనై 50

వ. అది యేమి యని విచారించుచుండు నంతలోఁ నొక తైర్థికుండు వచ్చి దర్శనమిచ్చి తనవృత్తాంతంబు చెప్పి వానివృత్తాంతంబు విని యిట్లనియె. 5

ఆ. ఆత్మహత్య చేయ నైతి గా దది దోష
విసరములకు నెల్లఁ బెద్దదోష
మనుచు మనువు చెప్పె నది గాన నాబుద్ధి
విడిచి నాదుమాట వినుము తెలియ. 52

తే. ఆంధ్రదేశమునందుఁ గృష్ణాపగకు స
దేశమందు మంగళగిరి తేజరిల్లు
నందు నారసింహస్వామి యఖిలభక్త
వరదుఁ డగుచుండె నాతనిపరిసరమున. 53

ఉ. పానక మాచరించుటకు భక్తులు బెల్లము గొట్టు పట్టునన్
గానఁగ వచ్చుఁ బాక మది కమ్మనివాసనఁ గ్రుమ్మరించుచున్
దానిని నీవు మేనిపయిఁ దాల్చిన నీదగుకుష్ఠముంజనున్
నే నిది యంతయుం దెలిసి నీకు వచింపఁగ నిందు వచ్చితిన్. 54

వ. అని చెప్పుచు నంతర్ధానంబు నొందినచందంబున నెట యేనియుం బోయె మాధవుండు నతనిమాధవుండ యని తలంచుచుం దనవారికిం జెప్పి తత్సాహాయ్యంబున మంగళగిరికిం జని స్వామిని సేవించి పానకంబు సేయు చోటఁ బ్రక్కలం బాలుపాకంబు సంగ్రహించి మేనెల్లం బూసికొనియుఁ గొంతభక్షించె నట్టు లొకమండలంబు గావించునప్పటి కెప్పటియట్ల దివ్యమంగళవిగ్రహుండై మంగళా

చలపతిం బూజించి నిజగృహంబునకు నిర్గమించె మఱియు నిట్టిమహాత్వంబు లెన్నియో మంగళాద్రి నారసింహునికడం జూపట్టు నింక భక్తులవృత్తాంతం బొకఝింత చెప్పెద వినుఁ డని యిట్లనియె. 55

## —♦ బాలాంబచరిత్రము ♦—

క. మంగళగిరిపురవరమున
నంగనలకు మేలుబంతి యై బాలమ నాఁ
గం గీర్తింపఁగ నగుచున్
సంగతిఁ గొనె భక్తురాలు సాధూత్పతి నాన్ 56

క. దేవులపల్లికొలంబున
నావిర్భావంబు నొంది హరువొందుచు నా
శైవారాన్వయసుబ్బన
జేవేరిగ నయ్యె బాల స్థిర బాల యనన్. 57

తే. అత్తవారింటి కరుదెంచినది మొదలుగ
మంగళాద్రినృసింహునిమహిమఁ దొంటి
పుట్టువందునె యామెకుఁ బుట్టెఁ గాన
దేవతారాధన మొనర్ప దివిరె నామె. 58

మ. పతిశుశ్రూషయు మంగళాద్రినృహరిపాంచత్పదాబ్జార్చనా
రతియుం దక్క మఱొక్కచింతనము నిద్రాకాలమం దైన నా
సతి యొక్కింత యెఱుంగ దెప్పుడు రమేశధ్యానమే చేయుచున్
బతితోఁ గూడి కులాలకీటగతిగాఁ బాటించె సంసారమున్.

తే. అట్లు కొన్నాళ్ళు గడచినయంత మీఁద
సతతహరిమంత్రజపమును సాధుసేవ
నారసింహపదారాధనంబు ముదురు
దాన బాలాంబ యోగినీత్వమును బూనె. 60

ఉ. వేకువ నిద్రలేచి నిజవిధ్యనుకృత్యము లెల్లఁ దీర్చి శ్ర
ద్ధాకలితస్వభావమున నానరకేసరిదర్శనంబు సు
శ్రీకముగాఁ బొనర్చి వనసీమకు నేగి లతాంత సంతతుల్

గైకొని వచ్చి యెత్తులను గట్టి హరిం గయిసేయు నెప్పుడున్. 61

ఆ. స్వామియెదుట నిలిచి సంతతధ్యానంబు
మనుజపంబుతోడఁ దనరఁ జేసి
తెలిసి నారసింహతీర్థప్రసాదముల్
స్వీకరించి యిల్లు చేరు సతము. 62

క. కొన్నాళ్ళు నిద్ర వోవదు
కొన్నాళ్ళలు భోజనంబుఁ గొన నొల్లదు తాఁ
గొన్నాళ్ళు మౌనముం గొనుఁ
గొన్నాళ్లలు భజన మెపుడు గొనకొని చేయున్. 63

♦—— బాలాంబ గుహలోఁ దపస్సు చేయుట ♦——

వ. ఇట్లుండి బాలాంబ యొక్కనాఁడు మంగళాద్రిగుహాభ్యంతరంబు నకుం జని నిద్రాహారంబులు విసర్జించి తపంబు గావించుటకుం దొడంగె నపుడు గృహంబున నామె చూపట్టమిం దెలిసి బందుగు లెల్లకడలు వెదకి కానం జాలక వేసారి యెటనో పడి చచ్చియుండు నని నిశ్చయించి రంత నిరువదిదినంబుల కొక్కనాఁటిమధ్యాహ్న కాలంబున గోపాలుం డొక్కరుండు గోవుల మేపుచు నక్కొండ నెత్తమ్మున సంచరించుచుండు నంత. 64

మ. ఒకలోయం బడి యున్నబాలయెడిలో నూఁ యంచునున్నట్టి బా
లకునిం గన్గొని నివ్వెఱంపడి వడిన్ లంఘించుచుం బోయి య
ర్భకునిం జేరఁగ వచ్చి తద్విధము సర్వంబు న్వచింపంగ నా
యకులం దోడ్కొని గొల్లతోడ నతఁ డాప్రాంతంబు సేరం జనెన్.

ఆ. ప్రజల రాకఁ జూచి బాలుఁడు మాయమై
పోయెఁ బోవునట్టిపొల్పు మాత్ర
చూచి రెల్లవారు చోద్యంబు పడి రప్డు
డర్భకుండు గొల్ల నడిగె నిట్లు. 66

ఉ. గొల్లఁడు బాలకుం డతఁడు కొంచెము కానఁగ వచ్చి పోయె ని
పెలకడల్ గనుంగొనిన నింతయు దోపఁ డిదేటి చిత్రమో
తెల్లము గాఁగఁ జూచితివె దివ్యుఁడు వోలెను దోప వచ్చెడిన్
సల్లపనంబు లెట్టియవి సాగెనో నీ వినినట్లు చెప్పవే. 67

ఆ. అనిన బోయఁ డనియె నరసితి ఁగనులార
నాలు గైదు నేండ్ల సల్లవాఁడు
బాలమాంబయొడినిఁ బనివడి కూర్చుండి
బువ్వఁ బెట్టు మనుచు ముద్దు గుడిచె. 68

వ. అప్పు డీతల్లి పిల్లవానిం గాంచి యి ట్లనియె. 69

ఉ. ముద్దులబిడ్డ! నీ వెవరు? ముళ్లను రాళ్లను బెట్టు చేమలుఁ
దద్దయు నల్లిబిల్లి గొనుదారి ని ట్లెటులు వచ్చితీవు నీ
సుద్దులు నాదుజానుగులఁ జొచ్చి సుధామధురంబు లై మదిన్
హ ద్దిసుమంత లేనటు ముదావహ మయ్యెడి నోకుమారకా. 70

వ. అనిన బాలకుండు బాలాంబదిక్కు మొగంబై యి ట్లనియె. 71

—— ఈశ్వర సాక్షాత్కారము ——

తే. తల్లిదండ్రులు లే రమ్మ తా వొకండు
చెప్పుటకు లేదు ది క్కెద్దో చెప్ప లేను
నీవె తల్లి వటంచు నీతావుఁ జేరి
నాఁడ నాఁకొంటి నింతయన్నం బొసఁగుము. 72

క. నీచేతియన్నముం దిన
నాచిత్తము గోరుచుండె నాతల్లి! యనన్
వాచించె బాలమాంబిక
యోచిరుతుక! నీకు నెట్టు లోదన మిడుదున్. 73

క. నిదురయు నాహారంబున్
సదనంబును విడచి యిట్లు సన్న్యాసమునన్
వదలక కొండల గుహలఁ
బొదలెద నా కెట్టు లన్నము లభించు నయో. 74

వ. అనిన నాబాలుం డోతల్లీ! నీ విట్లు కొండల బండల నుండఁ జెల్లదు గృహంబునకుం జని యడిగిన ప్రాణికోటికి లే దన కన్నంబు పెట్టు నట్టివ్రతంబు బట్టి యుండుము నీకుఁ జాలినంతధనంబు సంప్రాప్తం బగు నని పలుకుచుండ విని మీకడకు వచ్చితి నని గొల్లండు చెప్పిన వా రెల్లరుఁ దెలపోయి బాలాంబచెంతకుం జని సాష్టాంగనమ స్కారంబు గావించి ప్రార్థించి వాహనంబున నామె నింటికిం

గొనివచ్చి రామెయు నాదినంబు మొదలుకొని ప్రాణికోటి కన్నదానంబు చేయునట్టి దయ్యె నాబాలాంబయన్నసత్రంబునకుఁ జాలినధాన్యాదులు పుట్లకొలఁది వచ్చి పడుచుండ నన్నసత్రంబు సుపవిత్రంబై నిరంతరాయంబుగ సాఁగుచుండె నంత. 75

♦—— బాలాంబయన్నదానము ♦——

సీ. పవలు రాతిరి దాక యివ మైన జడి యైనఁ
జిమ్మచీఁకటి యైనఁ జీంద్ర మైన
బాడబుండే కాని బట్టు కానీ లేక
చండాలుఁడే కాని మొండె కాని
యన్నార్థియై రాఁగ నారసినంతనే
ర మ్మని కడుపాఱ రసవదన్న
మొసఁగి బాలాంబిక వసుధ వెండియు జన్మ
మందినయన్నపూర్ణాంబ యనుచుఁ

తే. జేరు పొంది మంగళగిరిపేటలోన
నన్నసత్రము సాఁగించునట్టి దగుచు
నృహరి సేవించునట్టిదై నేల నాల్గు
చెఱఁగులందును దనపేరు చెలఁగ మెలఁగె. 76

తే. నృహరితిరునాళ్లలో నొకయహము ద్విజులు
నాల్గువేలు భుజించుచుండంగఁ గుంభ
వృష్టి పడనున్నయప్పు డావేలఁది కుంభ
హారతిం బట్టి ప్రార్థించె నబ్జనాథు. 77

వ. అట్లు ప్రార్థించినంతలో నెక్కడిమ బ్బెక్కడన యడంగి పోవ్రుటం జేసి యెల్లరు సుఖంబుగ భుజించి రవ్వేల నొక్కతిరునాళ్లసమయం బున రాత్రికాలంబున. 78

శా. హాహాకారావ మెసంగ మన్ను మిను నొక్కొండైనచందంబునన్
గుర్వబ్దంబులు గప్పి యప్పురమునం గొండొక్కచో మొట్టిపో
కార్వం జొచ్చియుఁ గుంభవృష్టి కురిసెన్ హాహా యనన్ భూతముల్
నూర్వు ర్వచ్చిరి భోజనార్థు లగుచున్ భూమీసురగ్రామణుల్. 79

క. పదుగురకుఁ జాలునట్లు గ
సదనంబున బాల వంట సంతన చేసెన్
బదిపదులు పఱున వచ్చిరి
కద యెట్లో వారి కశనగతి యనుచు మదిన్. 80

క. జలమయము గ్రామ మంతయు
జ్వలనుఁడు వెలుఁగండు మఱియు వండుట కింటన్
గలుగవు తండులములు వి
ప్రులకున్ క్షుద్బాధ యెట్లు పో తీర్పంగన్. 81

క. అని బాలాంబిక యించుక
మన మది కలగంగ నగుచు మాధవునిదయన్
గొనినయది గాన ధైర్యం
బున నెల్లరఁ బోకుఁ డనుచు భుక్తికిఁ బిలిచెన్. 82

వ. ఎల్లరం బంక్తులు దీరఁ భోజనపాత్రంబులకడం గూరుచుండం బెట్టి బాలామహాదేవి మహానసంబునకుం జని నరకేసరిం దలంచుచు నన్నాదిపదార్థంబులపై నిన్ని తీర్థంబులఁ బ్రోక్షించి వంటవారిం బిలిచి వడ్డనంబు గావింపుఁ డనిన వారును వేగురకుం జాలున ట్లున్న పదార్థంబు మహానసంబు నిండి యుంటం గాంచి నివ్వెరంపడి యవ్వృత్తాంతం బెల్లరకుం దెల్లంబు గావించి మించిన వేడ్కన్ నానావిధపదార్థంబులు సంపూర్ణంబు లగునట్లు వారి కందఱకుం బెట్టె రది వినినవారు బాలాంబామహాత్వంబునకు మహదానందంబు నొందుచుఁ బ్రస్తుతించి రనంతరకాలంబున. 83

క. బ్రహ్మగ్రహపీడితుఁ డై
బ్రాహ్మణుఁ డొకఁ డరుగుదెంచి బాలాంబకడన్
జిహ్మగతి మెలఁగ నాయమ
బ్రాహ్మణునకుఁ దీర్థ మిచ్చి పాపెన్ గ్రహమున్. 84

వ. ఇట్లున్నసమయమున. 85

—♦ మానులు వచ్చి బాలాంబ సత్రమున భుజించుట ♦—

తే. మంగళాద్రిగుహాగేహమధ్యమందుఁ
దపము గావించుచుండెడు తాపసు లొక

నాఁడు బాలాంబసత్రమునకును వచ్చి
"మాత రన్నం ప్రదేహి"యనె మాటు యనిగి. 86

ఉ. వచ్చినవారి కర్ఘ్యమును పాద్యము నిచ్చి గృహాంగణంబునం
దిచ్చ వసింపఁ జేసి యొకయింతటిలోపల శాకపాకముల్
బచ్చడులుఁన్ ఘృతంబులును పాలును పెర్గును సంతరించి లో
నెచ్చినభక్తి వారి భుజియింపఁగఁ జేసెను బాల పోలగన్. 87

తే. వార లేవ్వరు భుజియించి పాలఁ గాంచి
తల్లి! తోతాద్రిగుహా నుండుతాపసులము
మేము నీయన్నము భుజింపఁగా మనసున
నభిలషించి వచ్చితి మిట్టులా ప్తబుద్ధి. 88

వ. తల్లీ! నీ విట్టు లన్నదానంబును నరసింహాసేవయుం గావించుచుఁ గొంతకాలం బుండి పిమ్మటఁ బరంధామంబునొందఁ గల వని పలుకుచునంతర్ధానంబు నొంది రి ట్లనేకమహాత్త్వంబులు భక్తురా లగు బాలాంబకడం బ్రత్యక్షంబు లగుచుండె ననిమఱియు ననేకభక్తులీమంగలాద్రినృసింహదేవునిసేవించి భుక్తిముక్తులం బడసి రావృత్తాంతంబు లవ్వాల నెఱింగించెద నని మఱియుని. 89

వరసంతానముఁ గోరివంధ్య నియమ ప్రారంభశుంభన్మతిన్
నరసింహున్ భజియించుచున్ నలుపదుల్ నాళ్లార్ద్రవస్త్రింబుతో
నరుదారన్ గుడికింబ్రదక్షిణముల య్యాదిరింబోనర్పంగ వ
త్సరకాలంబునఁ బుత్రుఁ గాంచి నిజవాంఛల్దీర మేలందెడిన్ 90

కనులఁ గాంచనివాఁ డుచని నృసింహుని పాద
జలమూని శుభదృష్టిగలిగిమెలఁగు
కుష్ఠరోగమువాఁడు నిష్ఠమైనరహరి
నిర్మాల్యమునుగొని నెఱినెసంగు
రాజయక్ష్మగలాఁడు రమణ నాహార్యభి
షేక జలంబానిజోకనొప్పఁ
జిత్తవిభ్రమముఁగాంచినవాఁడు నిగమాద్రి
హరిసన్నిధి మెలఁగిగరిమఁ గాంచు

తే. భూతములు పిశాచమ్ములు ప్రేతములును
సోఁకెనే జనుఁడయ్యద్రిఁ జూచినంత
మాత్ర దవ్వుఁబాఱు నా క్షేత్రమహిమ
తలము గాదెన్న వేనోళ్ల చిలువకైన 91

వ. అని పార్వతికిం బరమేశ్వరుం డానతిచ్చెను. 92

ఆ. శౌనకాదిమౌనిచంద్రులకున్ రోమ
హర్షణాత్మజుండు హర్ష మెసఁగ
మంగళాద్రిమహిమ మఱికొంద నెఱిఁగించె
భుక్తిముక్తిసిద్ధిఁ బొందఁ జేయు. 93

ఆశ్వాసాంతము.

శా. శ్రీలక్ష్మీనరసాంబికాహృదయరాజీవార్కుఁడై వేదల
క్ష్మీలక్ష్యుం డయి సాధులోకనిచయాశీఃపాత్రభూతంబు నా
శ్రీలక్ష్మీనరసింహభూసురుఁడు సుశ్రీవైభవోపేతుఁడై
శ్రీలక్ష్మీనరసింహమూర్తికరుణన్ జేకొంచు వర్ధిల్లుతన్. 94

మాలిని. దలితమునిజనార్తీ! దైవభూచక్రవర్తీ!
లలితపరమమూర్తీ! లబ్ధవర్ణానువర్తీ!
ఫలితవిపులకీర్తీ! భక్తచిత్తప్రవర్తీ!
కలితసుగుణపూర్తీ! ఖండితాత్మీయజూర్తీ! 95

గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ కవి
సార్వభౌమ ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన
మంగళగిరి మాహాత్మ్యంబునందుఁ
సర్వంబును బంచమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము.